శ్రీ ర స్తు.

శ్రీ పరబ్రహ్మణేనమః.

# ఆంధ్ర సంధ్యా టీక.

విజయనగరం కాలేజి సంస్కృత ప్రధానోపాధ్యాయులగు

శ్రీ. ఉ. వే.

మేడేపల్లి వేంకటరమణాచార్యప్రణీతము.

బ్రహ్మశ్రీ,

పండిత పురాణం సూర్యనారాయణతీర్థులవారిచే

సంస్కరింపఁబడినది.



1921.

మద్రాస్

ఆర్. వేంకటేశ్వర్ అన్డ్ కంపెనీవారిచే

ఆనందముద్రాక్షరశాలలో ముద్రింపించి

ప్రకటింపఁబడియె.

వెల 8 అణాలు.] [Price 8 As.

# పరిచయము.

---

నిత్యకర్మానుష్ఠాన నిరతులగు—ఆంధ్రసోదరులారా! వేద్యాధికార ముగల ప్రతిపురుషునకును సంధ్యావందన మవశ్యకర్తవ్యమగుటయు, ఆచరింపనిచో ప్రత్యవాయము కలుగుటయు వైదికుల కందఱకును తెలియనిది కాదు. అయినను సంధ్యావందనమునం దేమియున్నదో ఒక [illegible] మాత్రమే తెలిసినఁ దెలిసియుండవచ్చును. కాని, అట్టిసంధ్యావందనము కక్షురాస్యుల కెల్లరకును తెల్లమగునట్లు సమగ్రమయిన ఆంధ్రభాష్యము ప్రకటింపఁబడియుండలేదు. అట్టికొఱఁతను తీర్పించు నుద్దేశముతో ప్రస్తుతము ''ఆంధ్రసంధ్యాటీక'' అను ఈపుస్తకమును, చెన్నపట్టణాభరణాయమాన శ్రీమదానందముద్రాక్షరశాలాధికారులును, బహుగ్రంథ ప్రకటయితలును, పరమభాగవత శిఖామణులును, అగు శ్రీయుతులు వేమూరి రంగనాథశ్రేష్ఠిగారు శ్రీవిజయనగరవాస్తవ్యులును, సంస్కృతాంధ్రాంగ్లేయ భాషాపాండితీ మండనులును, శ్రీమదుభయవేదాంత ప్రవచనధురీణులును, శ్రీదేవవ్రతచరిత్ర కృతికర్తలును అగు శ్రీమన్నేదేపల్లి వేంకటరమణాచార్యులవారిచే సంస్కృతసంధ్యాభాష్యానుసారముగా తెలుఁగున టీక వ్రాయింపించి ఆస్తికజనుల కృతజ్ఞతకు పాత్రులయినారు. ఇట్టి యీ గ్రంథమును ముద్రింపించునపుడు తమముద్రాశాలలో పండితుఁడనై యుండిన నాకిద్దానిసంస్కరణ భారమును దయచేయించినారు. నేనును శ్రీవారియాజ్ఞను శిరసావహించి యథామతి సంస్కరించినాను. ఈ ''ఆంధ్రసంధ్యాటీక'' కేవలము స్మార్తులకే కాక ద్రావిడదేశీయ శ్రీవైష్ణవులకునయితము ఉపయోగించునట్లు వారి సంధ్యావందన ప్రకారముగూడఁ జేర్పఁబడినది. ముద్రణసమయమునఁ గాని, నా అల్పజ్ఞతచేతనుగానియిందెచ్చటనైనను ప్రమాదములు తటస్థించినచో తెలిపిన ద్వితీయముద్రణసమయమున సవరింపఁబడును.

ఇట్లు,

ఆస్తికవిధేయుఁడు

పురాణం – సూర్యనారాయణ తీర్థులు.

# ప్రధాన విషయసూచిక.



శ్రీ ర స్తు

ఓం నమః పరబ్రహ్మణే

# ఆంధ్ర సంధ్యాటీక

సర్వలోకరక్షణదీక్షితుఁడును, సర్వజ్ఞుఁడును, సర్వశక్తియు, సర్వకర్మారాధ్యుఁడును అగు సర్వేశ్వరుఁడు,

"హార్తుం తమ స్సదసతీ చ వివేక్తు మీశో
మానం ప్రదీపమివ కారుణికో దదాతి."

అన్నట్లు చీఁకటిని తొలఁగించి పదార్థములను చూపించు దీపమువంటిదైన వేదమను ప్రమాణమును అజ్ఞానమును నివారించి మంచి చెడ్డలను తెలియఁజేయుటకు నరుల కొసంగి యున్నాఁడు. ఈశ్వరుఁ డొసంగిన వేదము ననుసరించి మనము మేలు కీళ్లను తెలిసికొని నడచుట యత్యావశ్యకము. అశుభముల నడ్డి శుభముల నిచ్చు సాధనము లలౌకిక సాధనము లనంబడును. వేదవాక్యప్రతిపాదితములు కాని యితర సాధనములకు లౌకిక సాధనము లని పేరు. వేదవాక్యములయం దనేకవిధములగు శ్రేయస్సాధనములు ప్రతిపాదింపఁబడియున్నవి. మన మొనరించుపనులు వేదవిహితములు, వేదనిషిద్ధములు, ఉదాసీనములు అని మూఁడువిధములు. అవియే కర్మంబు లనంబడును. మొదటి రెండువిధంబులును ధర్మాధర్మంబులు. లౌకికములే ఉదాసీనములు. మనము చేయు విహితనిషిద్ధకర్మములు "శబ్ద

బుద్ధికర్మాణాం త్రిక్షణావస్థాయిత్వమ్" (ఉచ్చరింపఁబడిన శబ్దము, పుట్టిన బుద్ధి, చేయఁబడిన కర్మము, మూఁడు క్షణములకంటె నెక్కువకాల ముండ దని మీమాంసకమతము) అను న్యాయము ననుసరించి వెంటనే నశించును గాన నందు వలన నదృశ్యములైన గుణుతులు పుట్టి ఫలమును గలిగించు వఱకును ఉండి నశించు ననియును, అవియే యపూర్వంబు లనియును, అదృష్టంబు లనియును, పుణ్యపాపంబు లనియు, ధర్మాధర్మంబు లనియుఁ గొందఱు వక్కాణింతురు. వాని వలనఁ గలుగు ననుగ్రహ నిగ్రహరూపములైన యీశ్వర సంకల్పంబులే యని మఱికొందఱు చెప్పుదురు.

"యత్ త్వత్ప్రియం తదిహ పుణ్య మపుణ్య మన్య
న్నాన్య త్త్రయో ర్భవతి లక్షణ మత్ర బాహో."

('భగవన్ముఖోల్లాసకర మగునది పుణ్యము. తదితరము పాపము' అని అభియుక్తోక్తి.) ఎట్లైనను "ఫలమత ఉపపత్తేః" "లభతే చ తతః కామా న్మయైవ విహితాన్ హితాన్" అన్నట్లు ఫల సిద్ధి యీశ్వరసంకల్పాధీనము.

ధర్మరూపములైన కర్మములు నిత్యములు, నైమిత్తికములు, కామ్యములు నని మూఁడువిధములై యుండును. ఒక్కవాఁడు తాను జీవించియుండువఱకును ప్రతిదినమును చేయవలయు నని విధింపఁబడిన కర్మములు నిత్యకర్మములు. ఇవి సామాన్యధర్మములనియు, విశేషధర్మములనియు రెండు తెఱంగులు. అధర్మములను విడుచుట, ఇంద్రియములను జయించుట, ఆత్మపరిశుద్ధి, పరోపకారము, భూతదయ, మైత్రి మొదలగునవి సామాన్యధర్మములు. అనఁగా సర్వజనులును ఆచరింపఁదగినవి.

విశేషధర్మము లనఁగా "ఈ వర్ణమువారీపని చేయవలయును. ఈ యాశ్రమమువారీకర్మము నాచరింపవలయును" అని వేదముచే విధింపఁబడిన సంధ్యావందన, పంచమహాయజ్ఞాగ్నిహోత్రాదికర్మములు. నైమిత్తికకర్మము లనఁగా నిమిత్తము తటస్థించునపు డొనర్పవలసిన జాతకర్మ ప్రాయశ్చిత్తాదులు. నిత్యనైమిత్తికములు రెండును ఈశ్వరాజ్ఞారూపములు. అవి చేయకున్నఁ బ్రత్యవాయమును గలిగించునవి. ప్రత్యవాయ మనఁగా కీడు. కామ్యము లనఁగా అభీష్టఫలసాధనములు. అవి యీశ్వరానుజ్ఞారూపములు. అవియును యాగదానవ్రతతపః ప్రభృతులు, చేసినచో అభ్యుదయము కలుగును; చేయకున్నను కీడులేదు. పైని చెప్పఁబడిన సంధ్యావందన పంచమహాయజ్ఞాదు లట్టివి కావు. ఇవి నిత్యమును చేసితీఱవలెను. విశేషించి వీనిలో సంధ్యావందన మనునది సకలవైదికసత్కర్మములకును మొదటిదిగా పరిగణింపఁబడుచున్నది. కావున దాని స్వరూపవిశేషమును చక్కఁగాఁ దెలిసికొనుట బ్రాహ్మణ క్షత్రియ వైశ్యమాత్రులకు మిక్కిలి యావశ్యకము.

## సంధ్యానిత్యత్వసమర్థనము

"వసంతే వసంతే జ్యోతిషా యజేత" (ప్రతి వసంత ఋతువులోను జ్యోతిష్టోమము చేయవలెను) అను శ్రుతియందు "వసంతే వసంతే" అని ద్విరుక్తి యున్నట్లు, "అహరహస్సంధ్యా ముపాసీత" (ప్రతిదినమును సంధ్య నుపాసింపవలెను) అను శ్రుతియందుఁగూడ "అహరహః" అను వీప్స (ద్విరుక్తి) కానఁబడుటవలన నీ సంధ్యావందనకర్మము నిత్యమని తోఁచుచున్నది. "మూఁడు పురుషాంతరములు సోమపానము చేయని

యెడల బ్రాహ్మణ్యము పోవుననియు, ఆహితాగ్ని కాకుండ నుండుట ఉపపాతకములతో తుల్యముగా పరిగణింపఁబడు ననియును శాస్త్రమందు నింద కానవచ్చినట్లు, కాలాతిక్రమణము కాకుండ సంధ్య నుపాసింపనివానికి ప్రాయశ్చిత్తము గాని, నిందగాని యెచ్చటను చెప్పఁబడియుండకపోవుటవలన సంధ్యావందనము నిత్యకర్మమనుట సమంజసముగా కానేరా" దని యొకఁడు శంకింపవచ్చును. కాని దీని కిది సమాధానము: సంధ్యావందనమునకు ప్రధానమైన గాయత్రీమంత్రమును యుక్తకాలమం దుపదేశింపనియెడల ప్రాయశ్చిత్తము లేదని నీయభిప్రాయమా ? లేక సంధ్యావందనమును కాలమతిక్రమింపకుండఁ జేయకపోయినచో ప్రాయశ్చిత్తము విధింపఁబడియుండలేదని నీయభిప్రాయమా ? ఇ[illegible]యో చెప్పుము. యుక్తకాలమందు గాయత్రీమంత్రోపదేశము చేయనియెడల ప్రబలప్రాయశ్చిత్తము నాపస్తంబుఁడు, ఆశ్వలాయనుఁడు మొదలగు ఋషులు "అత ఊర్ధ్వం పతిత సావిత్రీకా భవంతి; నైనా నుపనయే న్నాధ్యాపయే న్నైభి ర్వివాహయేత్ న యాజయేయుః" (పదియారు సంవత్సరములు దాఁటినను ఉపనయనము లేనివారికి మఱి ఉపనయనము చేయఁగూడదు. వారికి వేదము చెప్పఁగూడదు. వారికి వివాహము చేయఁగూడదు. వారిచే యాగము చేయింపఁగూడదు) అని విధించియుండుటవలన మొదటి వికల్పశిరస్సు ఖండింపఁబడినది. సంధ్య వార్చకపోవుట బహు ప్రత్యవాయ మని యనేకస్మృతికర్తలు వ్రాసియుండుటవలన రెండవ కల్పశిరస్సుకూడ నిరసింపఁబడినది. సంధ్యోపాస్తినొన

ర్వకపోవుటవిషయమై గోభిలుఁ డిట్లు వ్రాయుచున్నాఁడు:—

"సంధ్యా యేన న విజ్ఞాతా సంధ్యా యేనానుపాసితా,
జీవమానోభవే చ్ఛూద్రో మృత శ్శ్వాన్నోఽభిజాయతే."

సంధ్య నుపాసింపనివాఁడు బ్రతికియున్న కాలమంతయు శూద్రుఁ డగును. మరణానంతరము శునకమయి పుట్టును.

విష్ణుపురాణమందు—

"ఉపతిష్ఠంతి యే సంధ్యాం యే న పూర్వాం న పశ్చిమామ్,
వ్రజంతి తే దురాత్మాన స్తామిస్రం నరకం నృప."

ఓయి రాజా! ప్రాతస్సాయంసంధ్యల నెవ్వ రుపాసింపరో ఆ దురాత్ములు తామిస్రమను నరకమును పొందుదురు.

కూర్మపురాణవచనము—

"యోఽన్యత్ర కురుతే యత్నం ధర్మకార్యే ద్విజోత్తమ,
విహాయ సంధ్యాప్రణతిం స యాతి నరకాయుతమ్."

సంధ్యోపాస్తివిడిచియెవ్వఁ డితరధర్మకార్యములవిషయమై ప్రయత్నించునో వాఁడు పదివేల నరకములయందు కూలును.

దక్షస్మృతి—

"సంధ్యాహీనోఽశుచి ర్నిత్య మనర్హ స్సర్వకర్మసు,
యదన్య త్కురుతే కర్మ న తస్య ఫలభా గ్భవేత్."

సంధ్యోపాసనము లేనివాఁడు పరిశుద్ధుఁడు కాఁడు. సకలకర్మములయందును అనర్హుఁడు. తా నొనరించు నితర కర్మముల ఫలమును సైతము పొందలేడు.

స్మృత్యంతరమందు—

"య స్సంధ్యాం కాలతః ప్రాప్తా మాలస్యా దతివర్తతే,
సూర్యహత్యా మవాప్నోతి ఉలూకత్వ మియా త్తథా."

ఎవ్వఁడు సోమరితనముచే సంధ్యోపాసనకాలము నతిక్రమింపఁజేయునో వాఁడు సూర్యునిఁ జంపిన పాపమును పొందును. గుడ్లగూఁబయై పుట్టును.

"సాయం ప్రాత స్తథా సంధ్యాం యే విప్రా నహ్యుపాస తే,
తా నేవ ధార్మికో రాజా శూద్రకర్మసు యోజయేత్."

ఏ బ్రాహ్మణులు సాయంప్రాతఃకాలములయందు సంధ్య నుపాసింపరో వారిని ధార్మికుఁడగు రాజు శూద్రుఁడు చేయఁదగిన కర్మములయందు నియోగింపవలెను.

సంధ్యావందనము చేయకపోవుట ప్రబలదోషావహమని యిట్లనేకస్మృతులయందుఁ జెప్పఁబడియుండుటచే నిది నిత్య మని సిద్ధించుచున్నది.

## సంధ్యామంత్రార్థజ్ఞాన మావశ్యకము

ఇట్టి సంధ్యామంత్రముల అర్థమును తెలిసికొని సంధ్యోపాసనము చేసినయెడల బ్రాహ్మణుఁడు విశేషఫలమును పొందును. అర్థజ్ఞానశూన్యముగా చేసినచో ఫలము లేదు. ఇందులకు ఛాందోగ్యమందు—

"య దేవ విద్యయా కరోతి శ్రద్ధయోపనిషదా త దేవ వీర్యవ త్తరం భవతి"

పురుషుఁడు దేని నర్థజ్ఞానముతోను,ఆస్తిక్యబుద్ధితోను చేయునో అదియే బలిష్ఠమైన దగును.

నిరుక్తమందు—

"స్థాణు రయం భారహారః కిలాభూ దధీత్య వేదం న విజా

నాతి యో ఽర్థమ్, యో ఽర్థవిత్సకలం భద్ర మశ్నుతే
నాక మేతి జ్ఞానవిధూతపాప్మా."

అధ్యయనము చేసి వేదార్థ మెఱుంగనివాఁడు బరువు మోసికొనియుండు మొఱడువంటివాఁడు. అర్థవేత్తి సకలశుభములనొందును; స్వర్గమును పొందును; జ్ఞానముచే పాపమును నివారించుకొనును.

స్మృత్యంతరమందు—

"య దధీత మవిజ్ఞాతం నిగదేనైవ శబ్ద్యతే,
అనగ్నా వివ శుష్కైధో న తత్ జ్వలతి కర్హిచిత్."

అగ్నికానిదానియం దుంచిన యెండుకట్టెవలె నర్థజ్ఞానశూన్యమైన చదువు ప్రకాశింపదు.
లఘువ్యాసస్మృతియందు—

"వేదస్యాధ్యయనం సర్వం ధర్మశాస్త్రస్య చాపి యత్,
అజ్ఞాతార్థం తు తత్సర్వం తుషాణాం ఖండనం యథా."

అర్థమును తెలిసికొనక వేదములను,ధర్మశాస్త్రములను చదువుట ఊకను దంచుట వంటిది. అనఁగా వ్యర్థమనుట.

"యథా పశు ర్భారవాహీ న తస్య భజతే ఫలమ్,
ద్విజ స్తథార్థానభిజ్ఞో న వేదఫల మశ్నుతే."

బరువుమోయు పశు వెట్లు దానిఫలము ననుభవింపనేరదో అట్లే అర్థమును దెలిసికొనక వేదమును చదివినవిప్రుఁడు వేదఫలమును పొందలేఁడు.

వ్యాసస్మృతియందు—

"జ్ఞాత్వాజ్ఞాత్వా చ కర్మాణి జనో యో యో ఽనుతిష్ఠతి,
విదుషః కర్మసిద్ధి స్స్యా త్తథా నావిదుషో భవేత్."

మంత్రార్థ మెఱింగి కర్మములను చేయు విద్వాంసుఁడు కర్మసిద్ధి నొందిన ట్లవిద్వాంసుఁడు పొందలేఁడు.

అందువలన నర్థమెఱుఁగక వేదము చదివెడువారిని పూజింపనవసరము లేదని యీ దిగువ వ్రాసిన స్మృతివాక్యములలోఁ జెప్పఁబడుచున్నది.

"పాఠమాత్రారతా న్వేదే ద్విజాతీ నర్థవర్జితాన్,
పశూనివ స తా న్ప్రాజ్ఞో వాజ్మాత్రేణాపి నార్చయేత్."

అర్థ మెఱుఁగక కేవలపాఠమాత్రము నభ్యసించెడు వైదికులను ప్రాజ్ఞుఁడు మాటచేనైనను పూజింపఁగూడదు.

పూర్వోక్తమగు ప్రమాణవచనములచేత నర్థజ్ఞాన మావశ్యక మని స్పష్టమగుచున్నది. వేదార్థము నెఱింగిన వాని ఫలమును మును లిట్లు చెప్పుచున్నారు.

"వేదశాస్త్రార్థతత్త్వజ్ఞో యత్ర కుత్రాశ్రమే వసేత్,
ఇహైవ లోకే తిష్ఠ న్స బ్రహ్మభూయాయ కల్పతే."

వేదశాస్త్రముల తత్త్వమెఱింగినవాఁ డేయాశ్రమమందున్నవాఁడైనను ఈ లోకమందే బ్రహ్మత్వము నొందును.

హారీతస్మృతియందు—

"మంత్రార్థజ్ఞో జపన్ జుహ్వ త్తథై వాధ్యాపయన్ ద్విజః,
అధీత్య యత్కించిదపి వేదార్థాధిగమే రతః.
బ్రహ్మలోక మవాప్నోతి ధర్మానుష్ఠానతో ద్విజః."

మంత్రార్థమును కొంచె మెఱింగినవాఁడైనను జపించుచు, హోమముచేయుచు ధర్మానుష్ఠానము సలుపుటవలన బ్రహ్మలోకమును పొందును.

"న వేదపాఠమాత్రేణ సంతుష్టస్స్యాద్ద్విజోత్తమః,
పాఠమాత్రావసాయీ తు పంకే గౌరివ సీదతి."

బ్రాహ్మణుఁడు వేదమును కేవలమూలము మాత్రమును చదువుటచే సంతుష్టినొందఁగూడదు. కేవల పాఠమాత్రము తోడనే చాలించువాఁడు బురదయందు గోవువలె నశించును.

"యోఽధీత్య విధివ ద్విప్రో న వేదార్థం విచారయేత్,
స సాన్వయః శూద్రసమః పాత్రతాం న ప్రపద్యతే."

ఏ బ్రాహ్మణుఁడు వేదము చదివియున్నను తదర్థమును విచారింపఁడో వాఁడును, వానివంశస్థులును శూద్రతుల్యులు. వాఁడు పూజార్హుఁడు కాఁడు.

ఇట్లు పైని వ్రాసిన ప్రమాణములచే సంధ్యామంత్రముల కర్థమును తెలిసికొని సంధ్యనుపాసించుట యెక్కువ శ్రేయస్కర మని తెలియవచ్చుచున్నది.

ఉపదేశము బాగుగ సిద్ధించుకొఱకు మంత్రార్థజ్ఞానము గల ఆచార్యుఁడే బాలున కుపనయనము చేయఁదగినవాఁడు గాని యవిద్వాంసుఁ డగువాఁడు తగఁ డని సామయాచారికములయం దాపస్తంబుఁ డిట్లు వ్రాయుచున్నాఁడు. "తమసో వా ఏష తమః ప్రవిశతి య మవిద్వా నుపనయతే" (తా నవిద్వాంసుఁడై యెవఁ డితరుల కుపనయనమును గావించునో వాఁడు నరకమునుండి నరకమును ప్రవేశించును) ఆకారణము చేతనే యాగ మొనర్చువాఁడుగూడ "అర్థీ సమర్థో విద్వాన్"

అనుప్రమాణముచే విద్వాంసుఁడై యుండవలయునని విధింపఁబడినది. ఇందువలన నర్థజ్ఞానశూన్యమైన మంత్రాధ్యయనము కేవలము నిరర్థకమైనదనియు, సంధ్యావందనమంత్రముల కర్థము తెలిసికొనుట మిక్కిలి యావశ్యకమనియు నిర్ణయింపఁబడినది.

## సంధ్యోపాసన చేయువాని కుండవలసిన నియమము

"అస్నాతో నాచరే త్కర్మ జపహోమాది కించన,
స్నాత్వాఽధికారీ భవతి దైవే పిత్ర్యే చ కర్మణి."

జపహోమాదికర్మములను స్నానము చేయకుండఁ జేయరాదు. దేవపితృకర్మములయందు స్నానము చేసిన యధికారి యగును.

"అత్యంతమలినః కాయో నవచ్ఛిద్రసమన్వితః,
స్రవత్యేవ దివానక్తం ప్రాతఃస్నానం విశోధనమ్."

తొమ్మిదిరంధ్రములతోఁగూడిన యీ శరీరము మిక్కిలి మలినమయినది. అహర్నిశములు మలములను స్రవించుచుండును. ప్రాతఃస్నానముచే శుద్ధమగును.

"న ముహూర్త మప్రయత స్స్యాత్."

కొంచెమువేపైనను అశుచిగా నుండఁగూడదు.

"యజ్ఞోపవీతీ నిత్యోదక స్సంధ్యా ముపాసీత."

యజ్ఞోపవీతమును ధరించి యుదకముగలవాఁడై సంధ్యనుపాసింపవలెను.

ఇత్యాదిపూర్వోక్తప్రమాణములచే స్నానము చేసి సంధ్య నుపాసింపవలె నని విధింపఁబడుచున్నది.

## సంధ్యావందన ఫలవిచారము

"అహరహ స్సంధ్యా ముపాసీత" అను విధివాక్యముచే నీ సంధ్యావందనము నిత్యకర్మ మని తెలియఁబడుచున్నది. చిత్రయాగాదులవలె నిది కామ్యము కాదు.

అట్లైనచో సంధ్య నుపాసింపనిపక్షమున బహుప్రత్యవాయము కలుగు నని ప్రతిపాదించు పూర్వోక్తప్రమాణ వాక్యములకు బాధ సంభవించును. "నిత్యకర్మము నిష్ఫలము కా"దను న్యాయము ననుసరించి నిత్యకర్మమగు సంధ్యావందనము నిష్ఫలమని చెప్పఁదగదు. అది ఫలశూన్యమగునేని దానియం దెవ్వనికిని ప్రవృత్తి కలుగఁబోవు నని చెప్పఁ గూడదు. 'ధర్మేణ పాప మపనుదతి' ధర్మముచేఁ బాపమును దొలఁగించుచున్నాఁడు. "యోగినః కర్మ కుర్వంతి సంగం త్యక్త్వాత్మశుద్ధయే" ఫలాభిసంధిని విడిచి యోగు లాత్మపారిశుద్ధ్యముకొఱకు కర్మముల నొనర్చుచున్నారు. "నిత్యనైమిత్తికై రేవ కుర్వాణో దురితక్షయమ్". నిత్యనైమిత్తిక కర్మములచేతనే పాపమును క్షీణింపఁజేసికొనుచున్నవాఁడై "సంధ్యా ముపాసతే యే తు సతతం సంశితవ్రతాః విధూతపాపాః" సంశితవ్రతులై యెవ్వ రెల్లప్పుడును సంధ్య నుపాసింతురో వారు నిరస్తపాపు లగుదురు.

ఇత్యాదిప్రమాణములచే నీ సంధ్యావందనమునకు ప్రత్యవాయనివృత్తియే ఫలమని ప్రతిపాదింపఁబడియుండుటచే ప్రత్యవాయనివృత్తిరూపఫలము దీని కుండుటచే ననుపపత్తి లేశమును లేదు. నిత్యకర్మమైన యీ సంధ్యావందనమునకు

గూడ ఫల మంగీకరించినచో దీనికిని కామ్యకర్మములకు ఏమి భేదము ? కామ్యకర్మములయందు ఫలాభిలాష కలదు.

సంధ్యావందనకర్మమందు ఫలాభిలాష లేకయే యాచరింపవలయును. ఈ రెండింటికిని ఇదియే భేదము. 'జ్యోతిష్టోమేన స్వర్గకామో యజేత'' ఇత్యాది వాక్యసామర్థ్యమువలన స్వర్గాదిఫలముల నపేక్షించి నరులు యాగాదికర్మములయందుఁ బ్రవర్తింతురు కావున నిచట యాగాదికము కామ్యము. ప్రకృతమం దట్టి ఫలకామన చే నాచరించుట లేకపోవుటవలనను, విధివాక్యమందు ఫలము వక్కాణింపఁబడకపోవుటవలనను సంధ్యావందనము నిత్యకర్మమనుట కాటంకము లేదు. సంధ్యానుష్ఠాన ప్రారంభమందు "మమోపాత్తదురితక్షయార్థం శ్రీపరమేశ్వర ప్రీత్యర్థం సంధ్యా ముపాసిష్యే'' నాచేఁ జేయఁబడిన పాపములను నశింపఁజేసికొనుటకును, భగవత్ప్రీతికొఱకును సంధ్య నుపాసింపఁబోవుచున్నాను' అని యెల్లరును పాపనాశనము, భగవత్ప్రీతియు ననెడి ఫలద్వయమును చెప్పి సంకల్పము చేయుచున్నను ఈ మాత్రముచే సంధ్యావందనమునకు కామ్యత్వము సిద్ధింపదు. ఇంతియకాక యే కర్మము చేయనియెడల ప్రత్యవాయము విధింపఁబడుచున్నదో ఆ కర్మము నిత్యకర్మ మనఁబడును. ఏది చేయనియెడలను ప్రత్యవాయము కలుగదో ఆ కర్మము నిత్య మని వ్యవహరింపఁబడదు.

మూఁడు సంధ్యలలో నేది ప్రధానము? మూఁడుసంధ్యలలోను సాయంసంధ్య ప్రధానము. దినపూర్వభాగమం దుపనయనమైనతరువాతను ఉపనీతుఁడు మాధ్యాహ్నికసంధ్య

వార్పుటకవకాశము కలవాఁడై యను సాయంసంధ్యయే ప్రారంభింపవలయు నని గౌతముఁడు, శౌనకుఁడు, ఆశ్వలాయనుఁడు మొదలగు గృహ్యసూత్రకారులును, స్మృతికర్తలును నుడివిరి.

"గాయత్రీంగురుణాదిష్టాం తిష్ఠన్నాసూర్య మభ్యసేత్,
సూర్యేఽస్తశిఖరంప్రాప్తే సాయంసంధ్యాముపక్రమేత్."

గురూపదిష్టమగు గాయత్రి నాసాయము నిలుచఁబడి యభ్యసించుచు సూర్యుఁ డస్తమింపఁగా సాయంసంధ్య నారంభింపవలె నని వసిష్ఠుడును,

"సంధ్యాత్రయం న కర్తవ్యం యావన్మౌంజీ న బధ్యతే,
సంధ్యాత్రయం తు కర్తవ్యం సాయమాది తతఃపరమ్"

ఉపనయన మైనపిమ్మట సాయంసంధ్య మొదలుకొని క్రమముగా తక్కినసంధ్యలు వార్చవలెను. ఉపనయనము కాక మునుపు మూఁడు సంధ్యలును వార్చ నవసరము లేదు.

"సావిత్రీంతుగురోర్లబ్ధ్వామంత్రార్థ్యాయనర్థోదితార్,
అభ్యస్యోపాసయేత్సంధ్యాం సాయమాది యథాక్రమమ్"

గురువువలన గాయత్రీమంత్రోపదేశమును పొంది ఆ మంత్రముల ననుసంధించుచు సాయంకాలము మొదలుకొని యథాక్రమముగా సంధ్యల వార్చవలెను.

"ఉపనీతౌ కృతాయాం తు సాయంసంధ్యా ముపక్రమేత్,
బ్రహ్మయజ్ఞం ప్రకుర్వీత మధ్యాహ్నే తు పరేఽహని.
ఉపాకరణపర్యంతం గాయత్ర్యా బ్రహ్మయజ్ఞకమ్,
కుర్యాన్మాధ్యాహ్నికీం సంధ్యాం తతస్స్మృత్యుక్తమార్గతః."

ఉపనయనము కాఁగానే సాయంసంధ్య మొదలుపెట్టి మఱునాఁడు యుక్తకాలమందు మాధ్యాహ్నికసంధ్య నాచరిం

పవలెను. ఉపాకరణ మయ్యెడు దనుక గాయత్రితోనే బ్రహ్మ యజ్ఞము చేయవలెను. గృహ్యాకారులుకూడ "యజ్ఞోపవీతీ నిత్యోదకః సంధ్యా ముపాసీత వాగ్యతః సాయ మాసీనః" 'వటుఁడు యజ్ఞోపవీతము, జలము గలవాఁడై మౌనము ధరించి కూర్చుండి సాయంసంధ్య నుపాసింపవలెను' అని చెప్పియుండు టచే మూఁడుసంధ్యలలోను సాయంసంధ్య ప్రథమము.

## సంధ్యోపాసనాకాలనిర్ణయము

"సంధౌ సంధ్యా ముపాసీత, ఆజ్యోతిషోదర్శనా త్సంధిః"
(ఛాందోగ్యము)

సగ మస్తమించుచున్న సూర్యుఁ డగపడు సమయము మొదలుకొని నక్షత్రములు కనుపడువఱకును ఉండెడు కాలమునకు సంధి యని పేరు. అట్టి కాలములో సాయంసంధ్య నుపాసింపవలెను. ఇందులకు స్మృతిప్రమాణము:—

"అర్ధాస్తమితకాలా ద్య స్సంధి రాతారకోదయాత్,
తత్ర సంధ్యా ముపాసీత సాయంకాలే సమాహితః"

సూర్యుఁ డర్ధాస్తమితుఁ డగుకాలము మొదలుకొని నక్షత్రములు కనఁబడువఱకునైన కాలము సంధి యనంబడును. ఆకాలమందు సాయంసంధ్యోపాసన మాచరింపవలెను. మఱి యొక స్మృతియం దిట్లు విశేషము చెప్పఁబడియున్నది:—

"అహోరాత్రస్య య స్సంధి స్సూర్యనక్షత్రవర్జితః,
తత్ర సంధ్యా ముపాసీత సాయంప్రాత స్సమాహితః"

సూర్యుఁడు, నక్షత్రములు కనుపడని యహోరాత్ర సంధియందు సాయంప్రాతస్సంధ్యల నుపాసింపవలెను.

### ఉత్తమాదిభేదములచే సాయంప్రాతస్సంధ్యోపాసనకాలము మూఁడువిధములు

"ఉత్తమా సూర్యసహితా మధ్యమాఽనుదితతారకా,
అధమా తారకోపేతా సాయంసంధ్యా త్రిధా మతా."
ఉత్తమా తారకోపేతా మధ్యమా లుప్తతారకా,
అధమా సూర్యసహితా ప్రాతస్సంధ్యా త్రిధా మతా."

సూర్యునితోఁ గూడిన సాయంసంధ్య ఉత్తమము. సూర్యుఁడస్తమించినను నక్షత్రము లుదయించకుండుసమయమునఁ జేయు సాయంసంధ్యోపాసన మధ్యమము. నక్షత్రములతోఁగూడినకాలమందు సాయంసంధ్య వార్చుట అధమము.

చుక్కలుండఁగా ప్రాతస్సంధ్యోపాసన మొనరించుట ఉత్తమము, చుక్కలు లేనిది మధ్యమము, సూర్యోదయమైనపిమ్మట ప్రాతస్సంధ్య నుపాసించుట అధమము.

"మధ్యాహ్నే తూత్తమాప్రోక్తా సంగమే మధ్యమా స్మృతా
అపరాహ్ణేఽధమా ప్రోక్తా త్రిధా మాధ్యాహ్నికే స్మృతా."

మధ్యాహ్నసంధ్య మధ్యాహ్నమం దుత్తమము. సంగమకాలమందు మధ్యమము. అపరాహ్ణమం దధమము.

ఈరీతిగా త్రివిధమైనకాలమం దెవ్వరు సంధ్య నుపాసింపరో వారందఱును అబ్రాహ్మణు లని శాతాతపుఁడు పలుకుచున్నాఁడు:—

"అనాగతాం తు యః పూర్వాం సాదిత్యాం చైవ పశ్చిమామ్,
నోపాసీత ద్విజ స్సంధ్యాం స సర్వోఽబ్రాహ్మణ స్స్మృతః.
ద్వాదశాహ మనగ్ని స్తు సంధ్యా కాలవిపర్యయః,
పతితాఖిలవేదోఽపి శూద్ర ఏవ న సంశయః.

కాలే తు వందితా సంధ్యా స్వర్గమోక్షప్రదాయినీ,
అకాలే వందితా సంధ్యా సా చ వంధ్యావధూరివ."

సకలవేదములు చదివినవాఁడైనను వరుసగా పండ్రెండు దినము లగ్నికార్యము చేయనివాఁడును, సంధ్యావందన కాలము నతిక్రమింపఁజేయువాఁడును శూద్రులు. కాలమందు సంధ్యవార్చినయెడల స్వర్గమోక్షములు కలుగును. అకాలమందైనచో నిష్ఫలము.

## సంధ్యాకాలాతిక్రమణప్రాయశ్చిత్తము

"ప్రాణాయామత్రయం ప్రాతః ద్విగుణం సంగమే స్మృతమ్,
మధ్యాహ్నే త్రిగుణం ప్రోక్త మపరాహ్ణే తు షడ్గుణమ్.
సాయాహ్నే ద్వాదశగుణం సూర్యహత్యాం తతో వ్రజేత్."

యుక్తకాలమందు సంధ్యవార్చనివాఁడు ప్రాతఃకాలమందు మూఁడు ప్రాణాయామములను, సంగమకాలమందాఱు ప్రాణాయామములను, మధ్యాహ్నకాలమందు తొమ్మిది ప్రాణాయామములను, అపరాహ్ణకాలమందు పదునెనిమిది ప్రాణాయామములను, సాయాహ్నమందు ముప్పది యాఱు ప్రాణాయామములను చేయవలయు నని శాస్త్రమందు ప్రాయశ్చిత్తము విధింపఁబడియున్నది. శాస్త్రోక్త ప్రాయశ్చిత్తమును జేసికొననివాఁడు సూర్యహత్యాదోషము నొందును.

"సంధ్యాకాలే త్వతిక్రాంతే స్నాత్వాచమ్య యథావిధి,
జపే ద్దశశతీం దేవీం తత స్సంధ్యాం సమాచరేత్.
ఏకాహం సమతిక్రమ్య ప్రమాదా దకృతం యది,

" అహోరాత్రోషితో భూత్వా
గాయత్ర్యాశ్చాయుతం జపేత్. "

సంధ్యాకాల మతిక్రమింపఁగా స్నానముచేసి ఆచమనముచేసికొని పదివేలు గాయత్రీమంత్రజపము చేయవలయును. ప్రమాదముచే నొక్కదినమందైనను సంధ్యావందనము చేయనియెడల నొకదిన ముపవసించి పదివేలు గాయత్రీ మంత్రజపము చేయవలెను.

" రాష్ట్రభంగే నృపక్రోధే రోగార్తే సూతకేఽపిచ,
సంధ్యావందనవిచ్ఛిత్తిర్న దోషాయ కదాచన. "

రాజ్యవిప్లవము సంభవించునపుడు, రాజు కుపితుఁడైనపుడు, రోగపీడయందు, జాతాశౌచమందు సంధ్యవార్చక పోయినను దోషము లేదు. అట్టికాలమందు పూర్ణముగా సంధ్యోపాసన మొనర్చుట కవకాశము లేకపోయినను మనస్సులోనైనను ఆమంత్రముల నుచ్చరించినయెడలఁ గర్మసిద్ధిను. బొత్తిగా కర్మలోపము చేయఁగూడదు. నిరంతర విద్యాసక్తులయినవారికి సంధ్యావందనకాలాతిక్రమణదోషము లేదని యీాదిగువ వ్రాసిన స్మృతివచనమువలన స్పష్టమగుచున్నది.

" దేవాగ్నిద్విజపిత్రాద్యానాం కార్యే మహతి సంస్థితే,
సంధ్యాలోపే న దోషోఽస్తి యస్మాత్సత్కర్మసాధనాః "

దేవతలను బ్రాహ్మణులను సేవించుటచేతను, విద్యావ్యాసంగముచేతను. సంధ్యావందనకాలాతిక్రమణమైనను అవియు సత్కర్మములే కావున ప్రత్యవాయము లేదు.

సంధ్యావందనమునకుమూఁడువిధములగు గౌణకాలము శాస్త్రముచే నిర్ణయింపఁబడినది.

"సాయంప్రాతర్యదోషో౽స్తి సంధ్యాకాలో౽తిపద్యతే,
ముఖ్యకల్పో౽నుకల్పశ్చ సర్వస్మిన్ కర్మణి స్మృతః."

పైని వ్రాయఁబడిన శ్లోకోక్తకాలమును మించకుండ ప్రతివారును సంధ్యావందన మొనర్ప శక్తులగుదురా? కాకున్న సర్వజాలనిపక్షమందు ప్రత్యవాయము సంభవిల్లు నన్న దో సమాధానము చెప్పఁబడుచున్నది. ప్రతికర్మమునకును ముఖ్యకల్పము, అనుకల్పము అని స్మృతులయందుఁ జెప్పఁబడుచున్నది. కావున సాయంప్రాతస్సంధ్యాకాలాతిక్రమణమునందు దోషము లేదు. స్మృత్యంతరమందు మధ్యమగౌణకాల మనుచితమని చెప్పఁబడినది.

"చతస్రో ఘటికా స్సాయం గౌణకాలో౽స్తి మధ్యమః,
ప్రాతఃకాలే౽ప్యేవమేవ సంధ్యాకాలో మునీరితః."

ప్రాతస్సంధ్యాకాలమునకు, సాయంసంధ్యాకాలమునకు మధ్యమగౌణకాలము నాలుగుగడియ లని మునులచేఁ జెప్పఁబడినది.

"సాయంకాలే త్రిఘటికా అస్తాదుపరి భాస్వతః,
ప్రాతఃకాలే త్రిఘటికా స్తత్ర సంధ్యాం సమాచరేత్."

సాయంకాలమందు సూర్యుఁ డస్తమించినపిదప మూఁడు గడియలవఱకును, ప్రాతఃకాలమందు సూర్యోదయానంతరము మూఁడుగడియలవఱకును సంధ్యోపాసనకు కాలము.

" ముఖ్యకాలే యదావశ్యం కర్మ కర్తుం న శక్యతే,
గౌణకాలేఽపి కర్తవ్యం గౌణోఽప్యత్రేదృశో మతః."

ఆవశ్యకమగు కర్మము ముఖ్యకాలమందుఁ జేయుటకు వీలుకానియెడల గౌణకాలమందైనను చేయవచ్చును. గౌణకాలముకూడ ముఖ్యకాలమువంటిదే.

" అత్రాపదీదృశో ముఖ్య ఏవేతి మునిసంమతః,
గౌణకాలేఽప్యతిక్రాంతే సూర్యహత్యాం ప్రవజేదితి."

ఆపత్సమయమందు గౌణకాలముకూడ ముఖ్యకాలమువంటిది. గౌణకాలముకూడ నతిక్రమించినచో సూర్యహత్యాదోషము పాటిల్లును.

"శ్రు. తస్మా దుత్తిష్ఠన్తగ్ హ వా తాని రక్షాగ్ స్యాదిత్యం యోధయన్తి యావదస్త మన్వగాత్ "

ఉదయించుచుండెడి సూర్యునితో నారాక్షసులు సాయంకాలమువఱకును యుద్ధము చేయుచుందురు. అనుశ్రుతిప్రామాణ్యమువలన ననుదినమును సూర్యునికి "మందేహు" లను పేరుగల యొకజాతిరాక్షసులతో సాయంకాలమువఱకును యుద్ధము జరుగుచుండుటవలన సంధ్యోపాసనము సూర్యునకా యుద్ధబాధను నివర్తింపఁజేయుటకు నిర్దిష్టమైనది కావున ప్రాతస్సంధ్యావందనము సాయంకాలమువఱకును చేయవచ్చును.

ఈరీతిగా సంధ్యావందన మాచరించువాఁడు ప్రాయశ్చిత్త పూర్వకముగానే ఆచరింపవలెను. స్మృత్యంతరమం దిట్లు ప్రాయశ్చిత్తము విధింపఁబడినది.

" ప్రాణాయామత్రయం ప్రాత
ర్ద్విగుణం సంగవే స్మృతమ్,

మధ్యాహ్నే త్రిగుణం ప్రోక్త
మపరాహ్ణే తు షడ్గుణమ్.
సాయాహ్నే ద్వాదశగుణం
సూర్యహత్యాం తతో వ్రజేత్."

మూఁడుసంధ్యావందనములకును విశేషించి కాల మతిక్రమించిన యెడలను ప్రాయశ్చిత్తము చెప్పఁబడుచున్నది. ముఖ్యకాల మనియు, గౌణకాల మనియు సంధ్యోపాసనమునకు రెండుకాలములు పైన నిర్ణయింపఁబడినవి. వీనిలో ముఖ్యకాలమతిక్రమించినచో నీక్రింద చెప్పఁబడినప్రాయశ్చిత్తముతో గౌణకాలమందుఁ జేయవలెను. ఆ ప్రాయశ్చిత్తము రెండుతెఱఁగులు. గాయత్రీమంత్రోచ్చారణపూర్వకమగునర్ఘ్యప్రక్షేపణ మొకటి, ప్రాణాయామాత్మకి మయినది రెండవది.

అర్ఘ్యప్రక్షేపణాత్మక మగుప్రాయశ్చిత్తమును గుఱించి వ్యాసుఁ డిట్లు చెప్పుచున్నాఁడు.

"ప్రణవవ్యాహృతియుతాం గాయత్రీం శిరసా సహా,
ఉచ్చార్య దత్వార్ఘ్యమాదౌ సంధ్యాకర్మ సమాచరేత్."

"భూర్భువస్స్వర్మహర్జన స్తపస్సత్యమ్" అనెడువ్యాహృతులు "ఓమాపో జ్యోతిః, ఇత్యాదిశిరోమంత్రము నుచ్చరించి యర్ఘ్యప్రదాన మొనరించి పిదప సంధ్యాకర్మము నాచరింపవలెను.

దీనికి స్మృత్యంతరమందు:—

"గాయత్రీం శిరసా సార్థ ముక్త్వా వ్యాహృతిభి స్సహా,
కాలాతీతవిశుద్ధ్యర్థం దత్వా సంధ్యాం సమాచరేత్."

వ్యాహృతులతోడను, శిరోమంత్రముతోడను గాయత్రి నుచ్చరించి "ముఖ్యకాలాతిక్రమదోషపరిహారార్థ మర్ఘ్య ప్రక్షేపణాత్మకం ప్రాయశ్చిత్తం కరిష్యే" అని సంకల్పించి ప్రాయశ్చిత్తార్ఘ్యమును విడిచి యనంతరము సంధ్యోపాసనము చేయవలయును. ఈప్రాయశ్చిత్తము మూఁడుసంధ్యల యందును సమానమే. ప్రాణాయామరూప ప్రాయశ్చిత్తము లోఁగడనే చెప్పఁబడినది.

ప్రాణాయామలక్షణమును మను విట్లు చెప్పుచున్నాఁడు.

"సవ్యాహృతికాం సప్రణవాం గాయత్రీం శిరసా సహ,
త్రిః పఠే దాయతప్రాణః ప్రాణాయామ స్స ఉచ్యతే."

ఓంకారముతోను, వ్యాహృతులతోనుకూడినగాయత్రీమంత్రమును శిరోమంత్రముతోఁ గలిపి ప్రాణవాయువును నిరోధించి మూఁడుమా ర్లుచ్చరించిన యెడల నదియొకప్రాణాయామ మని చెప్పఁబడును.—

{ పగటిసమయమున దైవికముగాఁ గాని, మానుషముగాఁ గాని మూఁడు సంధ్యలను వార్చుటకు వీలుపడనియెడల నేమి చేయవలెను? }.

పూర్వోక్తమగు ప్రాయశ్చిత్తమును జేసికొని రాత్రి యొక్క ప్రథమయామమునందుఁ గ్రమముగా ప్రాతర్మాధ్యాహ్నికసాయంసంధ్యల నుపాసింపవలెను.

ఈవిషయమున "లోకోపకార" మనుస్మృతియందిట్లు చెప్పఁబడినది.

"దివోదితాని కర్మాణి ప్రమాదా దకృతాని వై,
శర్వర్యాః ప్రథమే యామే తాని కుర్యా ద్యథాక్రమమ్."

పగలు చేయవలసినవిగా విధింపఁబడిన కర్మములు ప్రమాదముచేఁ బగటిపూట చేయనిపక్షమున రాత్రితొలి యామమున వానిని వరుసగా నాచరింపవలెను. ఈపక్షమునఁ గొందఱు "ప్రతికర్మమునకును యుక్తకాలము బలవత్తర"మను న్యాయము ననుసరించి మొదట సాయంసంధ్యను వార్చి విగఁ బడిపోయిన ప్రాతర్మాధ్యాహ్నికసంధ్యలను తరువాత వార్చ వలయు ననియును మఱికొందఱు క్రమముగానే ఆచరింపవలె ననియును చెప్పుచున్నారు. ఇందులకుఁ బ్రమాణము.

"కాలాతీతేషు పూర్వేషు ప్రాప్తవత్సుత్తరేషు చ,
కాలాతీతాని కృత్వైవ విదధ్యా దుత్తరాణి తు."

ముందు చేయవలసిన కర్మములయొక్క యుక్తకాల మతిక్రమించి పైకర్మము లాసన్నమైనపుడు కాలాతీతమైన కర్మములను ముందుగా నాచరించి యటుపై నుత్తరకర్మముల నాచరింపవలెను. శిష్టాచారమునుబట్టి ఆచారములు తెలిసికొన వలయును. ఆపస్తంబుఁ డట్లే చెప్పుచున్నాఁడు.

"సర్వజనపదే ష్వేకాంతసమాహిత మార్యాణాం వృత్తమ్, స్వధర్మనిరతానాం సమ్యగ్వినీతానాం వృద్ధానా మాత్మవతా మలోలుపానా మదాంభికానాం వృత్తం సాదృశ్యం భజే తైవ ముభౌ లోకా వభిజయతి" (సర్వదేశముల యందును ఆర్యులయొక్క సదనుష్ఠాన మేకరీతిగా నుండును. స్వధర్మనిరతులును, వినీతులును, అదాంభికులును, వృద్ధులును అగు ఆర్యులసదనుష్ఠానమునే యితరులుగూడ నాచరింపవలెను. అట్లాచరించువా రుభయలోకములను జయింతురు) ఇవు

డేపతు మాశ్రయింపవలె నన్నచో మాధ్యాహ్నికసంధ్య నుపా
సించుట కవకాశము లేక సాయంకాల మయినపుడు సాయం
సంధ్యావందనమును మొదట చేసి తరువాత నిలిచిపోయిన
మధ్యాహ్నసంధ్య వార్చవలెను. సాయంసంధ్యావందనకాలము
కూడ నతిక్రమించినచో యథాక్రమముగా సంధ్యల నుపాసిం
పవలెను. రాత్రిప్రథమయామముకూడ కడచిపోయినయెడల
నప్పు డెట్లు సంధ్య నుపాసింపవలె నన్నచో, అపుడు కర్మాను
ష్ఠానలోపము సంభవించె నని యూరకుండుటయే. ఇంక మఱే
మియు నవకాశము లేదు. ఇందులకుఁ బ్రమాణము:—

"అకాలే చేత్కృతం కర్మ కాలే ప్రాప్తే పునః క్రియా,
కాలాతీతేతు యత్కార్యా దకృతం తద్వినిర్దిశేత్."

యుక్తకాలము రాకుండఁగర్మముల నాచరించినయెడలయుక్త
కాలమందు మరలదాని నాచరింపవలెను. గౌణకాలముకూడ
నతిక్రమించినతరువాత నాకర్మములను మఱియాచరింప గూ
డదు. పైనఁజెప్పబడినప్రాయశ్చిత్తము నేఆచరింపవలెను.సంధ్యా
దనిత్యకర్మానుష్ఠానము లేకుండ నొకపగలు, ఒకరాత్రియును
గడచినయెడల మఱునాఁ డుపవసించి పదియాఱు ప్రాణాయా
మములు చేసి యెనిమిదివేలమార్లు గాయత్రీ మంత్రజపము
చేయువలయు నని మనుస్మృతికారుఁడు చెప్పియున్నాఁడు.

"వేదోదితానాం నిత్యానాం కర్మణాం సమతిక్రమే,
స్నాతకవ్రతలోపే చ ప్రాయశ్చిత్తమభోజనమ్.
సంధ్యావందనహీనో తు నిత్యస్నానం విలుప్య చ,
హోమం చ నిత్యకం శుద్ధ్యే సావిత్ర్యష్టసహస్రకమ్."

## సంధ్యాశబ్దార్థ విచారము.

సంధియం దైనది సంధ్య. సంధి యనఁగా దివారాత్రములు కలియుకాలము.

"సంధ్యా ముపాసీత" అనువిధివాక్యమం దున్నసంధ్యాశబ్దము చిచ్ఛక్తిరూపదేవతాపరము. ఆదేవత నుపాసింపవలె నని యర్థము. ఆదేవతను ధ్యానించుచు ఆచమనము మొదలుకొని అభివాదనాంతము కర్మము నాచరింపవలయును. ఆదేవతను గూర్చి వసిష్ఠుఁ డిట్లు చెప్పుచున్నాఁడు:—

"యా సంధ్యా సా జగత్సూతి ర్మాయాతీతా హి నిష్కలా,
ఈశ్వరీ కేవలా శక్తి స్తత్త్వత్రయసముద్భవా,
ధ్యాత్వార్కమండలగతాం సావిత్రీం వై జపే ద్బుధః."

ఈవచనముచే సూర్యమండలమం దాదిత్యశబ్దవాచ్యమగు పరబ్రహ్మరూపమే ఆచిచ్ఛక్తి యనియును, అదియే సంధ్యాదేవత యనియును జెప్పఁబడినది. అర్కమండలమం దున్న యాదేవతను ధ్యానించి సవితృదేవతాక మగు ఋక్కును జపింపవలెను. ఆఋక్కు గాయత్రి. లోకములో పండితపామరసామాన్యముగా "సంధ్యాశబ్దమునకు కర్మపరము గా నర్థ మున్నదిగాన చిచ్ఛక్తిరూపమగు దేవత యని యర్థము చెప్పుట విరుద్ధముగా కానవచ్చుచున్నదే" అన్నచో నిజమే. ముఖ్యవృత్తిచే సంధ్యాపదమునకు చిచ్ఛక్తిపరత్వ మున్నను "సంధౌ భవా సంధ్యా" అనువ్యుత్పత్తిచేతను క్రియాపరముగాఁ గూడఁ జెప్పనగును. ఇందులకు వ్యాసుఁ డిట్లు చెప్పుచున్నాఁడు.

"ఉపాస్తే సంధివేళాయాం నిశాయాం దివసస్య చ,
తామేవ సంధ్యాం తస్మాత్తు ప్రవదంతి మనీషిణః."

రాత్రియొక్కయు, పగటియొక్కయు సంధియందు దేని నుపాసించుచున్నాఁడో దానినే సంధ్య యని విద్వాంసులు చెప్పుచున్నారు.

"సంధౌ సంధ్యా ముపాసీత నాస్తగే నోద్గతే రవౌ."

సాయంకాలమందు సూర్యుఁ డస్తమించకమునుపును ప్రాతఃకాలమున సూర్యుఁడుదయించకమునుపును దివారాత్ర సంధియందు సంధ్య నుపాసింపవలె నని యాజ్ఞవల్క్యుఁడుకూడ చెప్పియున్నాఁడు. చిచ్ఛక్తిరూపమగు నాదిత్యాఖ్యదేవతను ధ్యానించుచు సంధ్యావందనక్రియను జరపవలెను. ఇచ్చటను కొంద ఱిట్లు పలుకుచున్నారు. సంధియం దుపాస్యమగు దేవత సంధ్య. దానితో సంబంధించినక్రియనుబట్టి సంధ్యాపదముకర్మమునందు పర్యవసించిన దని పలుకుచున్నారు కాని యది సరి కాదు. "సంధౌ భవా సంధ్యా" అనువ్యుత్పత్తిచే సంధ్యాపదమునకు కర్మపరత్వము సాక్షాత్తుగా సంభవింపఁగా పరంపరావశమున దానిని కల్పించుట నుచితము "ఉపాసీత" అనివిధింపఁబడిన యుపాసన, కర్త్రధీనధ్యానరూప మగు క్రియ కాని జ్ఞానము కాదు. జ్ఞాన మెప్పుడును ప్రమాణపరతంత్రమేగానిపురుషపరతంత్రము కాదు. ఇందులకు శ్రుతిప్రమాణము.

" ఉద్యన్తమ స్తంయంత మాదిత్య మభిధ్యాయన్
కుర్వన్ బ్రాహ్మణో విద్వాంత్సకలం భద్ర మ
శ్నుతేఽసావాదిత్యో బ్రహ్మేతి బ్రహ్మైవ సన్
బ్రహ్మాప్యేతి య ఏవం వేద"

వక్ష్యమాణమగు ప్రాణాయామాది కర్మముల నాచరించుచు సంధ్యాశబ్దవాచ్యుఁ డగునాదిత్యుని బ్రహ్మముగా ధ్యానించుచు, ఐహికాముష్మికఫలముల నొందుచున్నాఁడు. ఇట్టి ధ్యానముచే నతిశుద్ధాంతఃకరణుఁడై బ్రహ్మమును సాక్షాత్కరింపఁ జేసికొనుచున్నాఁడు. ఆదిత్యరూపమగు చిచ్ఛక్తియే "గాయత్రి" అను పేరుతో వ్యవహరింపఁబడుచున్నది. అందుచే జపకాలమందు గాయత్రీధ్యానము విధింపఁబడెను.

"గాయత్రీం చింతయేద్యస్తు హృత్పద్మేసముపస్థితామ్,
ధర్మాధర్మవినిర్ముక్త స్సయాతి పరమాం గతిమ్."

శ్రుతిచే నాదిత్యధ్యానము స్మృతిచేగాయత్రీధ్యానమును విధింపఁబడినవి. ఆదిత్యరూపచిచ్ఛక్తియే గాయత్రీశబ్దవాచ్యమని యొప్పుకొననియెడల జపకాలమందే గాయత్రియొక్కయు, ఆదిత్యునియొక్కయు ధ్యాన మిష్టముగా నుండదు. ఏలయన నొకకర్త యేకకాలమందు ప్రధానములగు రెండుకర్మములను చేయనోపఁడు. కావున, ఆదిత్యరూపమగు చిచ్ఛక్తియే గాయత్రీశబ్దముచేఁ జెప్పఁబడుచున్నది. బ్రహ్మచైతన్యమే గాయత్రీమంత్రముచేఁప్రతిపాదింపఁబడుచున్నది కావున, చిచ్ఛక్తిరూపము. ఆదిత్యరూపము, గాయత్రీరూపము అగుబ్రహ్మచైతన్యమే సంధ్యాదేవత యని తెలిసికొనవలయును.

## సంధ్యాప్రధానాఙ్గకర్మవిచారము.

అర్ఘ్యప్రదానము, గాయత్రీమంత్రజపము, సూర్యోపస్థానము అనునీమూఁడును సంధ్యోపాసనమందు ముఖ్యకర్మములు. స్మృత్యుక్తమగు మార్జనాదికము వాని కుపకారకమగునంగకర్మము.

"ఓంకారవ్యాహృతిపూర్వాం
గాయత్రీం బ్రాహ్మణో జపేత్,
త్రిష్టుభం చైవ రాజన్యో జగతీం వైశ్యఏవచ."

అని స్మృతికారుఁడుచెప్పిన ట్లచ్చట "గాయత్రీం" అని జపము విధింపఁబడి యుండుటవలన గాయత్రీమంత్రజపమే ప్రధాన మని తెలియఁబడుచున్నది. "ఓమిత్యేకాక్షరం బ్రహ్మ" ఇత్యాదిహృదయపఠనము, ప్రాణాయామము, అంగన్యాసకరన్యాసములు, ధ్యానము మొదలగునవిగాయత్రీమంత్రజపాంగములు.

"గాయత్ర్యాఽభిమంత్రితా ఆప ఊర్ధ్వంవిక్షిపంతి" అని అర్ఘ్యప్రదానమునే ప్రధానముగా శాస్త్రము విధించియుండుటవలనను, జాతాశౌచమృతాశౌచములయందుఁగూడ గాయత్రీమంత్రజపమును, సూర్యోపస్థానమును నిషేధించినను అర్ఘ్య ప్రక్షేపణమును మాత్రము విధించియుండుటవలనను పూర్వోక్తములగు మూఁడుకర్మములలోను అర్ఘ్యప్రదానమే ముఖ్యమైన దని నిశ్చయింపఁబడుచున్నది. ఇందులకు ప్రమాణవచనము.

"స్వాధ్యాయజపహోమాది మాశౌచేవర్జయేత్సదా"
"ఆశౌచేఽప్యసా వంజలీ న్ప్రక్షిప్యసూర్యం
ధ్యాయ న్నమస్కుర్యాత్"

అని పైఠీనసస్మృతి. ఆశౌచమందుఁగూడ దోసిళ్లతో నీళ్లుచల్లి సూర్యుని ధ్యానించుచు నమస్కరింపవలెను. స్మృతికారులు దీనినంతయుఁ జక్కఁగ నాలోకించి ఆగ్నేయాదియా

గత్రయము నాచరించురీతిగా : మూఁడును (అర్ఘ్యప్రదానము, సూర్యోపస్థానము, గాయత్రీమంత్రజపము) సంధ్యోపాసన మందు ముఖ్యకర్మము లని వక్కాణించియున్నారు. దైవికము గాఁ గాని, మానుషముగాఁగానియొకప్పు డీమూఁడుకర్మము లను పొనరించుట కవకాశము లభింపనిచో వీనిలో నొక్కదా నినైనను ఆచరించినయెడలఁ బూర్ణముగా సంధ్యావందన మాచరించువాని ఫలము లభించును.

## ఆ చ మ న ల క్ష ణ ము.

ఆచమన మనఁగా ప్రాయత్యసిద్ధికొఱకు విధ్యుక్తముగఁ జేయుజలప్రాశనము. ఇది శ్రౌతాచమనము, స్మార్తాచమనము, పౌరాణాచమనము, అని మూఁడువిధములు.

"యః క్రియాః కురుతే మోహా దనాచమ్యైవ నాస్తికః
భవంతి హి వృథా తస్య క్రియా స్సర్వా న సంశయః."

ఆచమనము చేయకుండ నొనర్చుకర్మము వ్యర్థమనుట. వీనిలో "విద్యుదసి విద్య మే పాప్మాన మృతాత్సత్య ముపైమి" అనుశ్రుతిచే చోదితమగునది శ్రౌతాచమనము. ఇది బ్రహ్మ యజ్ఞాంగము.

"హస్తా వవనిజ్య, త్రి రాచామేత్, ద్విః పరిమృజ్య, సకృ దుపస్పృశ్య, శిరశ్చక్షుషీ నాసికే, శ్రోత్రే, హృదయ మాలభ్య"

(చేతులు కడిగికొని ముమ్మారు ఆచమింపవలెను. రెండుమార్లు చేతులు కడిగికొని యొకమాఱు శిరస్సు, కన్నులు, ముక్కు, చెవులు స్పృశించి హృదయమును ముట్టు కొని) అనునది శ్రౌతాచమనక్రమము.

"గోకర్ణాకృతిహస్తేన మాషమగ్నజలం పిబేత్,
తన్న్యూనమధికం వాపి సురాపానసమం భవేత్.
ఆచామే న్మాషమగ్నం చ గోకర్ణచులుకస్థితమ్,
సంహతాంగులినా తోయం గృహీత్వా పాణినా ద్విజః.
ముక్తాంగుష్ఠకనిష్ఠాభ్యాం త్రిః పిబే ద్బ్రహ్మతీర్థతః,
తతః ప్రక్షాళ్య పాదౌ చ సంకుచ్యోష్ఠౌ త్రిరప్యథ.
సంహతాంగులిభిర్మార్జ్య త్రిః ప్రమృజ్యాత్తతో ముఖమ్,
ప్రక్షాళ్య హస్తావాభ్యుక్ష్య పాదశీర్షం తథైవచ.
మధ్యమాంగులిపృష్ఠే చ త్రిస్స్పృశే ద్ఘ్రాణమూలకమ్,
హస్తౌ ప్రక్షాళ్య సంస్పృశ్యఘ్రాణాది ద్వయశః పృథక్,
అంగుష్ఠేన ప్రదేశిన్యా ఘ్రాణౌపశ్చా దుపస్పృశేత్,
అంగుష్ఠానామికాభ్యాంచ చక్షుశ్శ్రోత్రేచసంస్పృశేత్,
అంగుష్ఠోపకనిష్ఠాభ్యాం నాభిం పశ్చాదుపస్పృశేత్,
తలేన హృదయం స్పృష్ట్వా స్పృశే దంగులిభిశ్శిరః.
అంగుళ్యగ్రై ర్బాహుమూలే సంస్పృశే దితి శౌనకః,
ప్రణవే నోదకం ధృత్వా వ్యాహృత్యాసంపరిషించయేత్,
అనేన విధినా విప్రః కుర్యా దాచమనం సదా."

గోకర్ణాకారముగలహస్తము చేమినుపగింజమునుగుపాటిపరిమాణముగలజలమును పానముచేయవలెను. తరువాతను పాదములుకడిగికొనిసంకుచితమైనపెదవులుమువ్మార్లుతుడిచికొనికూర్చినవ్రేళ్లకొనలతో ముఖముమువ్మార్లుతుడిచిహస్తములుపాదములు కడిగికొని శిరస్సు తుడిచి నడిమివ్రేళ్ల వెనుకభాగముచేనాసాగ్రమును స్పృశించి చేతులుకడిగికొనిరెండుజేసిమార్లునాసాగ్రమును తుడిచిబొటనవ్రేళ్లతోముక్కు

పుటములను, అగుంష్ఠానామికలతో కన్నులను చెవులను కొటమన చిటికెనవ్రేళ్లతో నాభిప్రదేశమును, కరతలముతో హృదయమును సంహతాంగుళులతో శిరస్సును, వ్రేళ్లకొనలతో భుజాగ్రములను స్పృశింపవలె నని శౌనకుండు చెప్పెను. ప్రణవముచ్చరించి జలము పట్టుకొని తనపై నిప్రోక్షించుకొనవలయును.

## స్మృత్యాచమనము.

ఇది శ్రౌతము, స్మార్తము అని ద్వివిధము అందులో మొదటిది దర్శపూర్ణమాసాంగము గాయత్రీజపాంగమును అగుచున్నది.

"దేవ్యాః పాదై స్త్రిభిః పీత్వాఽబ్లింగై స్త్రిభి స్స్పృశేత్,
సప్తవ్యాహృతిసంయుక్తా గాయత్రీ [illegible]."

గాయత్రీపాదములు మూండును చెప్పి మూండుజలపానము చేసి ఆపోహిష్ఠాదు లగుతొమ్మిది నూక్తమంత్రములు, సప్తవ్యాహృతులు, గాయత్రిగొక్క మూండుపాదములు, శిరోమంత్రముయొక్క రెండుఖండములు అను నీయిరువదియొకటితోను ఉపస్పర్శన మాచరించుట శ్రౌతాచమనము.

## సంధ్యాదికర్మాంగమగుస్మార్తాచమనము.

"త్రిష్ణ న్నాచామే త్ప్రిహర్వో వాఽఽసీన స్త్రిరాచామే ద్ధృదయంగమాభిరద్భి స్త్రిరోష్ఠౌ పరిమృజే ద్ద్విరిత్యేకే సకృదుపస్పృశే ద్ద్విరిత్యేకే దక్షిణేన పాణినా సవ్యం ప్రోక్ష్య పాదౌ శిర శ్చేంద్రియాణ్యుపస్పృశ్యచక్షుషీ నాసికే శ్రోత్రే చాథాప ఉపస్పృశేత్."

అని మూలసూత్రఖండికయందుఁ జెప్పఁబడినది. దీని యర్థము నిలువఁబడికాని, వంగికాని, ఆచమనము చేయరాదు. కూర్చుండి ముమ్మా ఱాచమింపవలెను.

ఆచమనము చేసినజలము బ్రాహ్మణునకు నాభీగతము కావలెను. క్షత్రియునకు కంఠగతము కావలెను. వైశ్యునకు తాలువులను పొందవలెను. పెదవిని అంగుష్ఠమూలముతో మూఁడుమార్లు తుడుచుకొనవలయును. రెండుమార్లని కొందఱ అభిప్రాయము. దక్షిణహస్తముచేత వామహస్తమును ప్రోక్షించి పాదములను శిరస్సును స్పృశించి అంగుష్ఠానామికలతో కన్నుల నొక్కమాఱుగాఁ గాని, వేఱువేఱుగఁగానిస్పృశించి, అంగుష్ఠతర్జనులతో ముక్కుపుటములను, అంగుష్ఠకనిష్ఠికలతోఁ జెవులను స్పృశించి చేతులు కడిగికొనవలెను. "త్రిః పిబేత్" అని చెప్పుటచే ముమ్మాఱు జలప్రాశనము చేసి కుడిచేతితో నెడమచేతియందు జలము పోసికొని చేతులు కడిగికొని ముఖమును రెండుసార్లు తుడిచి పాదములు కడిగికొని నాల్గువ్రేళ్లతోను పెదవి తుడిచికొని అంగుష్ఠతర్జనులతో ముక్కుపుటములను, అంగుష్ఠమధ్యమలతో కన్నులను, అంగుష్ఠానామికలతో చెవులను, అంగుష్ఠకనిష్ఠికలతో నాభిప్రదేశమును, కరతలములతో హృదయమును, అన్నివ్రేళ్లతోను శిరస్సును, బాహుమూలమును స్పృశింపవలెను.

"సంధ్యాయాం కర్మకాలేచ స్మృతే రాచమనం భవేత్.
బ్రహ్మాయజ్ఞే తు వై కుర్యాచ్ఛ్రుతే రాచమనం ద్విజః."

సంధ్యావందనకాలమందును, ఇతరకర్మముల నాచరించునపుడును స్మృత్యాచమనమును, బ్రహ్మయజ్ఞమందు శ్రుత్యాచమనమును చేయవలెను.

—••◆ పురాణాచమనప్రకారము ◆••—.

"కేశవాద్యైస్త్రిభిఃపీత్వా ద్వాభ్యాం ప్రక్షాళయేత్కరౌ,
ద్వాభ్యామోష్ఠౌచ సంమృజ్య ద్వాభ్యాముపస్పృశంతథా.
ఏకేన హస్తం ప్రక్షాళ్య పాదావపి తథైకతః,
ఏకేనాపి చ మూర్ధానం తత స్సంకర్షణాదిభిః.
సర్వాసామంగుళీనాం వై మూలేన చుబుకం స్పృశేత్,
తర్జన్యంగుష్ఠయోగేన ఘ్రాణద్వయముపస్పృశేత్.
అంగుష్ఠానామికాభ్యాంచ చక్షుశ్శ్రోత్రే పునఃపునః,
కనిష్ఠాంగుష్ఠయోగేన నాభిదేశ ముపస్పృశేత్.
కరమధ్యం హృది న్యస్య కరాగ్రాణి శిరసి న్యసేత్,
ముకుళేన చ హస్తేన భుజాభ్యామ్ ఉపస్పృశేత్.
ఏవమాచమనం కృత్వా నాశౌచ్యా రాగిణో భవేత్."

కేశవాదులగు ఇరువదినాల్గు నామములలో మూడింటితో జలప్రాశనము, రెండింటతో హస్తప్రక్షాళనము గావించి రెండు నామముల చేతను పెదవి తుడిచికొని రెండునామనము లుచ్చరించి హస్తప్రక్షాళనము చేసికొని ఒక్కొక్క నామముతో కరములు, పాదములు కడిగికొని శిరస్సు తుడుచుకొనవలెను. ఇప్పటికి బంద్రెండు నామములయ్యెను. మిగిలిన సంకర్షణాది నామములలో నొక్కొకనామమునుచ్చరించి, అంగుళ్యగ్రములతో గడ్డమును, బొటనవ్రేలితో ముక్కుపుటములను, అంగుష్ఠానామికలతో రెండు కన్నులను, రెండు

చెవులను, అంగుష్ఠకనిష్ఠికలతో నాభిని, గుండెపైని అఱచేయి ఉంచుకొని కరాగ్రమును, శిరస్సుపై నునిచికొని ముకుళహస్తముతో భుజాగ్రములను స్పృశింపవలెను.

"నాచామే దాసనస్థాంఘ్రి ర్న బద్ధాసన ఏవవా,
న ప్రసారితపాదో వా బహిర్జానుకరోఽపి వా"

ఆచమనము చేయునపుడు కొన్ని నియమములు కలవు. పీటమీఁదను కాళ్లుంచుకొనికాని, బద్ధాసనుఁడై కాని కాళ్లు చాఁచుకొనికాని తొడలకు వెలుపలను చేతులుంచుకొనికాని ఆచమనము చేయఁగూడదు.

## ప్రాణాయామలక్షణము.

ఆపస్తంబుఁడు "అర్థం వా సిసాధయిషుః"

అను సూత్రమందు దృష్టాదృష్టప్రయోజనములను సాధించుటకు కోరువాఁడు తనశరీరమునకు శ్రమముకలుగువఱకును మూఁడుమార్లు ప్రాణాయామము నొనర్పవలయు నని విధించియున్నాఁడు. కావున సంధ్యోపాసనముకూడ నదృష్టకర్మమే కావున దానియారంభమం దావశ్యకముగా ప్రాణాయామము నాచరింపవలెను.

"సవ్యాహృతిం సప్రణవాం గాయత్త్రీం శిరసా సహ,
త్రిఃపఠేదాయతప్రాణః ప్రాణాయామ స్స ఉచ్యతే"

అని మనువు (ఓంభూః, ఓంభువః, ఓగ్ సువః, ఓంమహః, ఓంజనః, ఓంతపః, ఓగ్ సత్యమ్" అని ఓంకారముతోఁ గూడిన వ్యాహృతులతోను, "ఓమాపో జ్యోతీరసోఽమృతం బ్రహ్మ భూర్భువస్సువరోమ్" అను శిరోమంత్రముతోను గూడిన

గాయత్త్రీమంత్రమును శ్వాసము బిగఁబట్టి మూఁడుమార్లు చ్చరించుట ప్రాణాయామ మనంబడును.

ఓంకారమహిమానువర్ణనము.

ఇచట భూలోకాద్యభిమానిను లైన దేవతలు ఓంకారార్థమగు పరబ్రహ్మముతో నైక్యముచేసి ప్రతిపాదింపఁ బడు చున్నవి. కావున నీవ్యాహృతులకు మొదట ప్రణవము చేర్పఁ బడినది. ఓంకారమునకు "అంగీకారము" అను నర్థమును స్వీకరించి నాచే నాచరింపఁబడు నీయాహ్నిక కృత్యమును భూలోకాద్యభిమానినులగు దేవత లంగీకరింతురుగాక, అనుతాత్పర్యముచేత భక్తిశ్రద్ధాపూర్వకముగా నాయా దేవతలకు తానొనర్చుకర్మమును నివేదించుటకు మొదట నోంకారము నిలుపఁ బడినది.

" ఓం కారశ్చాథశబ్దశ్చ ద్వావేతౌ బ్రహ్మణః పురా,
కంఠం భిత్వా వినిర్యాతౌ తస్మా న్మాంగళికా వుభౌ "

'ఓం' అథ, అనునీ రెండుపదములు తొల్లి చతుర్ముఖుని కంఠమునుండి బయలువెడలినవి గావున మంగళవాచకములు.

" ఓంకార స్సర్వవేదానాం సారభూతః ప్రకీర్తితః."
"ఓమితీదగ్ సర్వమ్ ఋచో అక్షరే పరమే వ్యోమన్,
నేదీయో బ్రహ్మణస్థానం సాలగ్రామో హరే ర్యథా."

ఈ 'ఓం' కారము సర్వవేదసార మనియు, సర్వమును ఓం కార మనియు సాలగ్రామమువలెనే యిదియును సర్వాత్మకుఁడగు భగవంతున కభివ్యక్తిస్థాన మనియును,అఖండానంద చిదేకరసుఁడును, నిష్కలంకుఁడును అగుపరమేశ్వరుని స్వరూపమును పరీక్షించుచుండెడి పరమయోగులు 'స్థూలారుంధతీ

న్యాయము'ననుసరించి యీయక్షరమందు బ్రహ్మదృష్టి నొ నర్చి రనియు శ్రుతిస్మృతిశతము లుద్ఘోషించుచున్నవి. ఇట్లు కానిచో పతంజలి యోగసూత్రములందు "తస్య వాచకః ప్రణవః" (ఓం కార మాభగవంతునికి వాచకము) 'తజ్జప స్తదర్థ భావనమ్' (ప్రణవజపము పరబ్రహ్మచింతనము) అని చెప్పునా?

"యతీనాం ప్రణవో మంత్రః "

"ఆత్మజ్ఞానే శమేచ స్యా ద్వేదాభ్యాసే చ యత్నవాన్"

(యతులకు ప్రణవమే మంత్రము, ఆత్మజ్ఞానసంపాదన మందు, శాంతిగుణమందు, వేదాభ్యాస మనఁగా ప్రణవజపమం దును బ్రయత్నింపవలయునని మనువుకూడఁ జెప్పియున్నాఁడు.) కావున ఓంకారము పరబ్రహ్మవాచక మగుటవలన వ్యాహృ తులకు ముందు చేర్పఁబడినది.

## ఓం కారశబ్దనిష్పత్తి.

ఈ శబ్దము " అవ-రక్షణే " అను ధాతువునుండి నిష్ప న్నమయినది. "అవతే ష్టిలోపశ్చ " (1-141) అను ఔణాదిక సూత్రముచే "మన్" ప్రత్యయము విధించి 'జ్వరత్వరస్రివ్యవి మవా ముపధాయాశ్చ' (పాణిని 6-4-20) అను సూత్రముచే "ఊఠ్" చేసి గుణము (ఓకారము) చేయఁగా "ఓమ్" అయి నది. "అకార ఉకారో మకార ఇతి తానేకధా సమభర త్తదే త దోమ్" అని శ్రుతి. బ్రాహ్మణుని కర్థజ్ఞానపూర్వక సకలవే దాధ్యయనము విధింపఁబడినది. బ్రాహ్మణునికి వేదాధ్యయన మే స్వకర్మ మని ధర్మశాస్త్రము పలుకుచున్నది. ఈ కాల పు మనుష్యు లల్పాయుష్యము గలవారగుటవలన సర్వవేదా ధ్యయనరూప మహాభాగ్యము వీరికి సంభవింపదు గావున సర్వ

సాధారణముగా సర్వవేదాధ్యయన ఫలసిద్ధ్యర్థమై సర్వవేదసారమగు ప్రణవము వ్యాహృతులకు మొదట పఠింపఁబడుచున్నది.

వ్యాహృతుల కర్థము.

"భూః"

'భవతేః క్విపి భూరితి రూపమ్' "భూసత్తాయామ్" అను ధాతువునకు "క్విప్" అను ప్రత్యయము చేర్పఁగా "భూః" అనురూపము సిద్ధించును. లేక "భవంత్యస్మాద్భూతానీతిభూః" ఇతనివలన భూతములు పుట్టుచున్నవి గావున "భూః" అని చెప్పఁబడును.

"భువః."

'భావయతి- స్థాపయతి- విశ్వమితి భువః.' సర్వప్రపంచమును స్థాపించువాఁడు కావున "భువః" అని చెప్పఁబడును.

"స్వః—సువః"

'సుఖరూపత్వాత్ -స్వః-స్వశ్శబ్దోహి సుఖవాచీ-' సుఖరూపుఁడగుటచే "స్వః" అని పేరు స్వశ్శబ్దము సుఖవాచకము.

"మహః"

'మహ పూజాయామ్' అస్మాదసుని 'మహః' పూజ్యార్థః. సర్వోత్కృష్టత్వేన పూజ్యత్వాన్మహ ఇత్యుచ్యతే. మహ ధాతువు పూజార్థకము. ఈధాతువునకు "అసున్" అను ప్రత్యయము చేర్పఁగా "మహః" అయినది. సర్వోత్కృష్టుఁ డగుటచేఁ బూజ్యుఁడని యర్థము.

"జనః"

'జన జననే' అస్మాదసున్,సర్వజననకర్తా,సకలజగజ్జననకర్తృత్వా జ్జనః, జనిధాతువునకు పుట్టుట అర్థము. సకల జగ

ములను పుట్టించువాఁడు గావున " జనః " అని చెప్పఁబడు చున్నాఁడు.

" తపః. "

'తప ఆలోచనే. అస్మాదసున్. సర్వవిషయ కాలోచన కర్తృత్వాత్తపః, జగద్రక్షణాదులగుఱించి ఆలోచించువాఁడు గావున "తపః" అనఁబడును.

" సత్యమ్ "

'ఉత్తమజ్ఞానానందరూపత్వాత్సత్యమ్' తదుక్తం.
'సచ్ఛబ్ద ఉత్తమం బ్రూయా దానందం త్వేతి వై వదేత్'
ఏతి జ్ఞానం సముద్దిష్టం పూర్ణానందదృశి స్తతః,

యద్వా సత్యం కాలత్రయాబాధ్యం, భూతభవిష్యద్వర్తమానరూప కాలత్రయేఽ ప్యబాధ్యత్వా త్సత్య మిత్యుచ్యతే. పూర్ణజ్ఞానానందములు కలవాఁ డగుటచే సత్యమనఁబడును. లేక మూఁడు కాలములయందును బాధింపఁబడనివాఁడు కావున సత్య మని పేరు. (బహ్వృచ సంధ్యాభాష్యము) గ్రంథాంతరమం దింకొకరీతిగా సమర్థింపఁబడినది.

"సప్త వ్యాహృతయ స్సప్త లోకా భూరాదయః క్రమాత్ "
ప్రత్యేకం ప్రణవాదిత్వా త్తన్మయా ఇతిసూచ్యతే"
" బ్రహ్మదిశ్చ తురీయంచ ప్రణవస్యార్థ ఈరితః,
తన్మయత్వేన భూరాదీన్ ధ్యాత్వా సప్రణవాఞ్జపేత్ "

భూరాదిసప్తవ్యాహృతులు క్రమముగా సప్తలోకములని చెప్పఁబడుచున్నవి. ఈ యేడులోకములును బ్రహ్మమయము లని ధ్యానింపవలయును.

గాయత్రీశిరస్సున కర్థము.

'ఓమాపోజ్యోతీ రసోఽమృతం బ్రహ్మభూర్భువస్సువరోమ్'

ఆపః=ఉదకములు, ఓమ్=పరబ్రహ్మమే, జ్యోతిః=సూర్యాది సంబంధ మగు తేజస్సు, ఓమ్=పరబ్రహ్మమే, "తేజ స్తేజస్వినా మహమ్" అనుగీతావచన మిందులకు ప్రమాణము. రసః = మధురాదిరసము, ఓం=పరబ్రహ్మమే (రసోఽహ మప్సు కౌంతేయ!) అని గీత. అమృతం=దేవతలు మొదలగువారి కన్నమగు పయస్సు ప్రణవప్రతిపాద్యమగుపరబ్రహ్మమే,"వేద స్తత్త్వం తపో బ్రహ్మ" అను నిఘంటువచనము వలనను. "వేదానాం సామవేదోఽస్మి" అను గీతా వచనమువలనను, 'బ్రహ్మము, సామవేదము ప్రణవ ప్రతిపాద్య మగు పరబ్రహ్మమే,"భూర్భువస్సువరోమ్ " అనుటచే సప్తలోకముల కుపలక్షణము సప్తలోకములును పరబ్రహ్మమే యనుట.

కేశవాదినామముల అర్థము.

ఓం కేశవాయ స్వాహా.

'కశ్చ ఈశశ్చ కేశౌ తౌ వర్తయతీతి కేశవః'

"క ఇతి బ్రహ్మణో నామ ఈశోఽహం సర్వదేహినామ్,
ఆవాంత్వదంగే సంభూతౌ తస్మా త్కేశవనామవాన్."

"కః" అనఁగా బ్రహ్మ, ఈశః=రుద్రుఁడు వీరిరువురును ఈతని శరీరమం దుద్భవించిరి గావున కేశవుఁ డనఁబడును.

ఓం-నారాయణాయ స్వాహా.

'నారాః-అయనం యస్య సః నారాయణః' ఉదకములు స్థానముగాఁ గలవాఁడు.

"ఆపో నారా ఇతి ప్రోక్తా ఆపోవై నరసూనవః,

అయనం తస్య తాః పూర్వం తేన నారాయణః స్మృతః''
అని మనుస్మృతి.

ఓం మాధవాయ స్వాహా.

మాయాః=లక్ష్మియొక్క, ధవః=పతి-లక్ష్మిపతి యనుట.

ఓం గోవిందాయ నమః.

'గాం అవిందత్ సముద్రమగ్నాం పృథివీం ప్రాప్తవాన్.' వరాహరూపియై ప్రళయజలధిలో మునిఁగిన భూమి నెత్తినవాఁడు.

ఓం విష్ణవే నమః.

'వేవేష్టి సర్వం జగత్ 'సర్వ జగమును వ్యాపించువాఁడు.

ఓం మధుసూదనాయ నమః.

'మధుం సూదయతీతి'మధు వను రాక్షసుని సంహారించినవాఁడు.

ఓం త్రివిక్రమాయ నమః.

'త్రయః విక్రమాః పాదవిక్షేపాః యస్య సః,' త్రివిక్రమావతారమందు మూఁడడుగులచే మూఁడులోకముల నాక్రమించినవాఁడు.

ఓం వామనాయ నమః.

'బలిం వామనరూపేణ యాచితవా నితి వామనః' వామనరూపముతో బలిని యాచించినవాఁడు.

ఓం శ్రీధరాయ నమః.

'శ్రియం ధరతీతి శ్రీధరః' లక్ష్మిని ధరించువాఁడు.

ఓం హృషీకేశాయ నమః.

'హృషీకాణా మింద్రియాణా మీశః' ఇంద్రియముల

కధిపతి అనఁగా 'పశ్యత్యచక్షు స్స శ్రుణోత్యకర్ణః, "అపాణి పాదో జవనో గృహీతా" అనునట్లు మనవలె నింద్రియాధీన జ్ఞానము కలవాఁడు కాఁడు.

ఓం పద్మనాభాయ నమః.

'పద్మం నాభౌ యస్య సః' సర్వజగత్కారణమగు పద్మము నాభియందుఁ గలవాఁడు.

ఓం దామోదరాయ నమః.

'దామ ఉదరే యస్య సః' ఉదరమందు తల్లిచేఁగట్ట బడిన త్రాడు గలవాఁడు.

ఓం సంకర్షణాయ నమః.

'సంహారసమయే యుగపత్ప్రజాః సంకర్షతీతి సంక ర్షణః' ప్రళయకాలమందొక్కమాఱుగ ప్రజలను లెస్సగా నూఁగాడువాఁడు.

ఓం వాసుదేవాయ నమః.

'వసంతి భూతాని యస్మిన్నితి—వాసుః.దీవ్యతీతి దేవః- వాసుశ్చాసౌ దేవశ్చ వాసుదేవః.'

సర్వభూతములును ఇతనియందు నివసించును. సర్వభూతములయందును ఇతఁడు నివసించును కావున వాసుదేవుఁడు.

ఓం ప్రద్యుమ్నాయ నమః.

'ప్రకృష్టం ద్యుమ్నం ప్రకాశః యస్య సః' గొప్ప ప్రకాశము కలవాఁడు.

ఓం అనిరుద్ధాయ నమః.

'న నిరుధ్యతే పరై రితి' పరులచే నిరోధింపఁ బడని వాఁడు.

ఓం పురుషోత్తమాయ నమః.

'పురుషాభ్యాం క్షరాక్షరాభ్యా ముత్తమః.' పురుషశబ్ద వాచ్యము లయిన క్షరాక్షరములకంటె నుత్తముఁడు.

" ద్వావిమౌ పురుషౌ లోకే క్షరశ్చాక్షర ఏవచ,
క్షర స్సర్వాణి భూతాని కూటస్థోఽక్షర ఉచ్యతే,
ఉత్తమః పురుష స్త్వన్యః పరమాత్మేత్యుదాహృతః"
ఇత్యాది గీతావచనము ప్రమాణము.

ఓం అధోక్షజాయ నమః.

'అధో న క్షీయతే జాతు యస్మా త్తస్మా దధోక్షజః' ఒకప్పుడైనను క్రిందుగ క్షీణదశనొందనివాఁడు.

ఓం నారసింహాయ నమః.

'నర శ్చాసౌ సింహ శ్చేతి నరసింహః' అథవా అన్యేన న రీయతే న క్షీయతే ఇతి నరః హిరణ్యకశిపుః తంహిన స్తీతి నరసింహః.'

నరత్వసింహత్వములతోఁ గూడిన రూపము గల వాఁడు. లేక, ఇతరులచే నశింపఁజేయఁబడనివాఁడు నరుఁడు అనఁగా హిరణ్యకశిపుఁడు. వానిని హింసించినవాఁడు కావున నరసింహుఁడు. నరసింహుఁడే నారసింహుఁడు.

ఓం అచ్యుతాయ నమః.

'స్వరూపసామర్థ్యా న్నచ్యవతే ఇత్యచ్యుతః. స్వపదా శ్రితా న్న చ్యావయతీతి వా.' —స్వరూపసామర్థ్యమువలన భ్రంశము నొందనివాఁడు, లేక, తనభక్తులను భ్రంశము నొందింపనివాఁడు.

ఓం జనార్దనాయ నమః.

,,ప్రళయకాలే జనా నర్దయతి నాశయతీతి జనార్దనః,, ప్రళయకాలమందు జనులను నశింపఁ జేయువాఁడు.

ఓం ఉపేంద్రాయ నమః.

'అనుజత్వేనేంద్ర ముపగతః' తమ్ముఁడై ఇంద్రుని పొందినవాఁడు.

ఓం హరయే నమః.

,,భక్తానాం పాపాని హరతీతి హరిః,'

భక్తుల పాపములను హరించువాఁడు కావున హరి.

ఓం శ్రీకృష్ణాయ నమః.

,,కంసాదీనాం కర్షణ కర్తృత్వాత్ కృష్ణః,

కంసాదుల నాకర్షించినవాఁడు గావున కృష్ణుఁడు. లేక,

''కృషి ర్భూవాచకశ్శబ్దో ణశ్చ నిర్వృతికారకః,
తయో రైక్యం పరం బ్రహ్మ కృష్ణ ఇత్యభిధీయతే''

జగమును సుఖింపఁ జేయువాఁ డని యర్థము.

ఆంధ్రస్మార్త బ్రాహ్మణ సంధ్యాప్రారంభము.

,,స్మృత్వాచమనం కృత్వా-ఉత్తిష్ఠంతు భూతపిశాచా ఏతే భూమిభారకాః, ఏతేషా మవిరోధేన బ్రహ్మకర్మ సమారభే, ఓం భూః,ఓం భువః,ఓగ్ సువః, ఓం మహః,ఓం జనః, ఓం తపః, ఓగ్ సత్యం, ఓం తత్సవితు ర్వరేణ్యం భర్గో దేవస్య ధీమహి ధియో యో నః ప్రచోదయాత్ ఓమాపోజ్యోతీ రసోఽమృతం బ్రహ్మ భూర్భువ స్సువరోమ్''.

శ్రీగోవింద ! గోవింద ! శ్రీమహావిష్ణో రాజ్ఞయా ప్రవర్తమానస్యాద్య బ్రహ్మణో ద్వితీయ పరార్థే శ్వేత వరాహ

కల్పే వైవస్వత మన్వంతరే కలియుగే ప్రథమపాదే జంబూ ద్వీపే భరతవర్షే భరతఖండే మేరోర్దక్షిణదిగ్భాగే కృష్ణా గోదావర్యోర్మధ్యదేశే సమస్తదేవతా బ్రాహ్మణ సన్నిధౌ అస్మిన్ వర్తమాన వ్యావహారికచాంద్రమానేన ... సంవత్సరే ... అయనే , ఋతౌ ... మాసే...పక్షే..తిథౌ ... వాసరే శ్రీవిష్ణునక్షత్రే శ్రీవిష్ణుయోగే శ్రీవిష్ణుకరణే ఏవంగుణవిశేషణవిశిష్టాయాం శుభతిథౌ శ్రీపరమేశ్వర ముద్దిశ్య మమోపాత్తదురితక్షయద్వారా శ్రీపరమేశ్వర ప్రీత్యర్థం ప్రాతస్సంధ్యా ముపాసిష్యే.

స్వాహాకారముతోఁ గూడిన మొదటి మూఁడు నామములను ఉచ్చరించి ఆచమనము చేయవలయును. భూమికి భారకములగు భూతపిశాచాదులుః తొలఁగి పోవును గాక. వీని యవిరోధముచే సంధ్యావందన కర్మము నాచరించుచున్నాను.

పిదప పూర్వోక్త రీతిగా సంకల్పము చెప్పి ప్రశస్త జలమును గ్రహించి "బ్రహ్మముఖ" మను పేరుగల మంత్రముచే నాజలము నభిమంత్రించి "ఆపోహిష్ఠాది" మంత్రములను ఉచ్చరించుచు దర్భలతో శిరస్సుపైని మార్జనము చేసికొనవలెను.

"ఆపోహిష్ఠాదిభి ర్మంత్రై ర్దర్భైశ్శిరసి మార్జయేత్"

అని స్మృతి.

'ఓంకార పూర్వికా స్తిస్రో మహావ్యాహృతయోఽవ్యయాః,
త్రిపదా చైవ గాయత్రీ విజ్ఞేయం బ్రహ్మణో ముఖమ్"

అని మనువు.

"స్పృష్ట్వాచాభిష్టుతం తోయంమూర్ధ్నా బ్రహ్మముఖేనచ,
ఆపోహిష్ఠాదిభి ర్మంత్రై ర్దర్భై శ్శిరసి మార్జయేత్"
"శిరసి ప్రోక్షయే న్మంత్రైః కుశై స్సోదకబిందుభిః"
ఆపోహిష్ఠేతి తిసృభి ర్దర్భై ర్మార్జన మాచరేత్,
పదే పదే క్షిపే న్మూర్ధ్ని ప్రతిప్రణవసంయుతమ్."

ప్రణవముతోఁగూడిన "ఓంభూర్భువస్సువరోమ్" అను మూఁడువ్యాహృతులు పదత్రయముగల గాయత్రియు బ్రహ్మముఖ మని యెఱుంగవలెను. గాయత్రీశిరస్సుచేతను, బ్రహ్మముఖమంత్రముచేతను అభిమంత్రింపఁబడిన జలమును గ్రహించి, ఆపోహిష్ఠాదిమంత్రముచే దర్భలతో శిరస్సునందు ప్రోక్షించుకొనవలెను. మూఁడు ఋక్కులలోను ఉన్న తొమ్మిదిపదములకును మొదటను ప్రతిదానికిని ప్రణవమును చేర్చి 'ఓం ఆపోహిష్ఠామయోభువః' '2 ఓం తానఊర్జే దధాతన' '3 ఓం మహే రణాయచక్షసే' '4 ఓం యోవశ్శివతమో రసః' '5 ఓంతస్య భాజయ తేహ నః' '6 ఓంఉశతీరివ మాతరః.' '7 ఓం తస్మాఅరంగమామవః' '8 ఓం యస్యక్షయాయ జిన్వథ' '9 ఓం ఆపో జనయథాచ నః" అని యుచ్చరించుచు జలమును శిరస్సుపైని పలుమాఱు చల్లుకొనవలయును.

ఇట్లు మార్జనచేసికొనుటవలనఁ గలుగుఫలమును వ్యాసుఁ డీరీతిగాఁ బలుకుచున్నాఁడు.

"రజస్తమోమోహజాతా జాగ్రత్స్వప్నసుషుప్తిజాః,
వాఙ్మనఃకాయజా దోషా న్నవై తా న్నవభిర్దహేత్"

రజస్తమోమోహములవలనఁ గలుగునవియు, జాగ్రత్స్వప్నసుషుప్త్యవస్థలయందుఁ బుట్టునవియు, త్రికరణకృత

ములును అగు తొమ్మిదివిధములదోషములను పైని వ్రాయఁబడిన మార్జన మంత్రముయొక్క తొమ్మిదిఖండములచేదహింపవలెను.

"ఆత్మానం ప్రణవేనైవ పరిషిచ్య జలైస్సహ,
కుర్యాత్సప్రణవైః పాదైర్మార్జనం తు కుశోదకైః.
యస్య క్షయాయేతి జలం సకుశం ప్రక్షిపే దధః,
ఋగంతే వాథ పాదాన్తే మార్జనం సుసమాహితః,
అర్ధర్చాంతే తథా కుర్యాచ్ఛిష్టానాం మతమీదృశమ్."

(అనిశాతాతపుఁడు.) అట్టిమార్జన మవిచ్ఛిన్నజలధారచేఁ జేయవలయును కాని విచ్ఛిన్నధారగల జలముచేఁ జేయఁగూడదు. అట్లు చేసినచో సంధ్యోపాస్తిదూషింపఁబడును. దేవతలు పితృదేవతలును ఒప్పుకొన రని పరాశరమాధవీయమం దిటులు చెప్పఁబడియున్నది.

"ధారాచ్యుతేన తోయేన సంధ్యోపాస్తి ర్విగర్హితా,
పితరో న ప్రశంసంతి న ప్రశంసంతి దేవతాః."

మఱి యెట్లు చేయవలయు ననఁగా:—

"నద్యాస్తీరే తటాకే వా భాజనే మృణ్మయేఽపి వా,
ఔదుంబరే వా సౌవర్ణే రాజతే దారుసంభవే,
ధృత్వాతు వామహస్తేన సంధ్యోపాస్తిం సమాచరేత్."

నదీతీరమందుఁ గాని, తటాకమందుఁగాని జలమును మట్టితోను, మేఁడికఱ్ఱతోను, బంగారుతోను, వెండితోను, చేయఁబడిన పాత్రయందు గ్రహించి యెడమచేతితోఁ బట్టుకొని సంధ్యోపాసన మొనర్చవలెను.

"వామహస్తే జలం ధృత్వా యేతు సంధ్యాముపాసతే,
సా సంధ్యా వృషలీ జ్ఞేయా అసురా స్తైస్తు తర్పితాః"

ఎవరెడమచేతిలో జలముంచుకొనిసంధ్య నుపాసింతురో వారురాక్షసులనుతృప్తినొందింతురు. ఆసంధ్య శూద్రతుల్యము. అని నిషేధశాస్త్ర ముండుటచే వామహస్తమందు జలమును ధరించి యెట్లు మార్జన చేసికొనవచ్చు నందురేని "మృణ్మయాదిపాత్రాంతరసద్భావే వామహస్తో నిషిద్ధః,మృణ్మయాద్యభావే"కృత్వాతు వామహస్తే వా"అనిపరాశరమాధవీయము. మృణ్మయాదిపాత్ర లున్నప్పుడు వామహస్తము నిషిద్ధము. అట్టిపాత్రలు దొరకనప్పుడు వామహస్తముచే జలమును స్వీకరింపవచ్చు నని పరాశరమాధవీయమందు వక్కాణింపఁబడి యున్నది కావున పూర్వోక్తవిరోధము లేదు.

మతాంతరమందు మఱియొక విశేషము చెప్పఁబడినది.

"స్పృష్ట్వా హస్తేన వామేన తటాకేషు సరిత్సు చ,
పాణినా దక్షిణేనైవ మార్జయే త్సకుశేన తు."

నదీజలమును గాని తటాకోదకమును గాని, యెడమ చేతితోఁ బట్టుకొని దర్భలతో మార్జనచేసికొనవలయును. ఈరీతిగా మార్జనము చేసికొనవలయును.

మార్జనమంత్రార్థము వివరింపఁబడుచున్నది.

మం. ఆపో హి ష్ఠామయో భువ స్తా న ఊర్జేదధాత న.

టీ. హేఆపః = ఓ-ఉదకములారా! (హి-ఏవకారార్థము గలది) (యూయమేవ=మీరే) మయోభువః=సుఖమునుగలుగఁజేయువారు, స్థ = అగుదు. "యద్వై శివం తన్మయః" అను

శ్రుతివలన మయశ్శబ్దమునకు సుఖమర్థము. ‹ఆపోహిష్ఠ మయో భువ స్సుఖభువః, అని నిరుక్తము.

తాః=(సుఖభూములయిన) ఆ, మీరు, నః=మమ్ములను, ఊర్జే=అన్నముకొఱకు, దధాతన=స్థాపింపుఁడు.

తా. మావరిచేలను బాగుగ వర్షముచే వృద్ధినొందించి మాకు పుష్కలమగునన్నమును సంపాదించి మమ్ములను సంప్రీతులనుగా నొనర్పుఁడు. అని తాత్పర్యము.

'మహే రణాయ చక్షసే.'

మహే=గొప్పదియు, రణాయ = రమణీయమైనదియును అగు, చక్షసే=ఇంద్రియజ్ఞానముకొఱకు, నః=మమ్ములను, దధాతన=స్థాపింపుఁడు. పుష్కలమగునన్నము లభింపఁగా మనుష్యునికి సర్వేంద్రియ సంతుష్టి కలుగును. ఇంద్రియస్వాస్థ్యమువలన జ్ఞానము బాగుగఁ బ్రసరించును. కావున మొదట నన్నము యాచింపఁబడినది.

"యోవ శ్శివతమో రస స్తస్య, భాజయతేహ నః
ఉశతీరివ మాతరః."

రసముతోఁగూడినయన్నమే యింద్రియపుష్టికి హేతువు గావున నీమంత్రమం దారసమును యాచించుచున్నాఁడు.

టీ. వః = మీయొక్క, యశ్శివతమోరసః=ఏసుఖకర మైన రసము (సారము) కలదో, తస్య-తం=ఆరసమును (ద్వితీయార్థమందు షష్ఠి) ఉశతీః = ప్రీతిగల, మాతర ఇవ=తల్లులవలె, (వాత్సల్యముగలతల్లులు తమబిడ్డలకు స్తన్యమును వలె) ఇహ = ఇచ్చట, నః=మమ్ములను, భాజయత=పొందింపుఁడు.

పై మంత్రముచే యాచించిన జలగతరసమునే మఱి యొకరీతిగా నత్యాదరముతో యాచించుచున్నాఁడు.

"తస్మాఅరం గమామ వో యస్య క్షయాయ జిన్వథ, ఆపో జనయథా చ నః"

టీ. యస్య = ఏరసముయొక్క, క్షయాయ = నివాసముచేత, (తృతీయార్థమందు చతుర్థిని ప్రయోగించుట ఛాందసము) జిన్వథ=(మీరు) సంతసిల్లుచున్నారో, (ఎట్టిరసము ననలంబించి మీరు పరమానందము నొందుచున్నారో) (మేమాగసలబ్ధి కొఱకు)వః=మిమ్ములను, అరమ్=శీఘ్రముగా, గమామ=పొందు దుముగాక.

తా. ఉదకములారా! మీయందే యేరసమున్నదో ఆర సమును మా కొరకుఁ డని ఉదకదేవతలను ప్రార్థించు చున్నాఁడు.

ఈ మంత్రము చెప్పి దర్భలతోఁ గూడినజలమును క్రింద విడువవలయును. "యస్య క్షయాయేతి జలం సకుశం ప్రక్షిపే దథః" అని శాస్త్రము.

" ఏషవా అనృణో యః పుత్రీ"

అను శ్రుతిచొప్పున పితృఋణవిముక్తి నొందుటకు సం తతి ఆవశ్యకము గానఁ దత్ప్రాప్తికొఱకుదక దేవతలను ప్రార్థించుచున్నాఁడు.

ఆపో జనయథాచ నః.

టీ. హేఆపః = జలాధిష్ఠాన దేవతలారా, నః = మమ్ములను, జనయథ = సంతానమును పుట్టించువారినిగాఁ జేయుఁడు.

తా. ఉదకములారా మీయందున్న రసమును మాకిచ్చి మాకుఁ బుత్త్రసంపదను గలుగఁజేయుఁడు. మేము కూడ నారసమునవలననే జనించినారము. అది సకలప్రాణులకును జన్మహేతు వనుటకు "ఆపో వా ఇదగ్ సర్వం విశ్వాభూతాన్యాపః" అను శ్రుతియే ప్రమాణము.

పూర్వోక్త మగు మార్జనమంత్రార్థమునకు సరియైన శ్లోకములు.

"ఆపస్సుఖకరా నిత్యం యూయం తా దత్త నోఽశనమ్,
రమ్యభూరిదృశేఽస్మాక మన్నం తేన హి వర్ధతే.
యో రసో వశ్శివతమ స్తం ప్రాపయత చేహ నః,
స్తన్యం వత్సాన్ప్రాయయన్తి మాతరో వత్సలా యథా.
తస్మై తత్సిద్ధయే యుష్మా నలం గచ్ఛేమ సాదరమ్,
యూయం యద్వా స్వతఃపీతా ఆపో జనయథ స్ఫుటమ్."

ప్రాత ర్జలప్రాశనమంత్రము.

మూ॥ సూర్యశ్చ మామన్యుశ్చ మన్యుపతయశ్చ మన్యుకృతేభ్యః పాపేభ్యో రక్షంతామ్। యద్రాత్రియా పాపమకార్షమ్। మనసా వాచా హస్తాభ్యాం పద్భ్యాముదరేణ శిశ్నా। రాత్రి స్తదవలుంపతు। యత్కించ దురితం మయి। ఇదమహం మా మమృతయోనౌ। సూర్యే జ్యోతిషి జుహోమి స్వాహా ॥

టీ. సూర్యశ్చ=సూర్యుఁడు, మన్యుః=క్రోధము, మన్యుపతయశ్చ=క్రోధస్వాములగు రాగద్వేషాదులు, (క్రోధాధిష్ఠానదేవతలగు వారండ్రు) మన్యుకృతేభ్యః=కోపముచేఁ జేయఁబ

డిన, పాపేభ్యః=పాపములనుండి, మాం=నన్ను, రక్షంతామ్=రక్షింతురుగాక. రాత్రియా = రాత్ర్యా = రాత్రియందు, మనసా= మనస్సుచేతను, (పరపీడాద్యనుచింతనము మానసిక పాపము) వాచా = వాక్కుచేతను, (అప్రియానృతపరుషభాషణాదికము వాచికపాపము) హస్తాభ్యాం = హస్తములచేత, (గడ్డిపరకలు చీల్చుట మొదలగునవి కరకృతపాపములు) పద్భ్యాం=పాదములచేతను, (గోవులను బ్రాహ్మణులను కాలితోఁ దన్నుట మొదలగునవి పాదకృతపాపములు) ఉదరేణ=ఉదరముచేతను, (అభోజ్యభోజనాదికృతపాపము) శిశ్నా = శిశ్నముచేతను, (అగమ్యాగమనాదికము) యత్పాపమ్ = ఏపాపమును, అకార్షమ్=చేసితినో, తత్ = ఆపాపమును, రాత్రిః=రాత్రి, అవలుంపతు=పోఁగొట్టునుగాక, మయి = నాయందు, యత్కించ దురితం=(అబుద్ధిపూర్వకముగాఁ జేయఁబడిన) ఇతరపాప మెద్ది గలదో దానినంతయును శమింపఁ జేసికొనుటకు, మామ్=నన్ను, అమృతయోనౌ=మరణరహితమును జగత్కారణమును అగు, సూర్యే=సూర్యాత్మకమైన, జ్యోతిషి=స్వయంప్రకాశకమగు పరబ్రహ్మమందు, జుహోమి స్వాహా = హోమముచేయుచున్నాను. నే నీహోమముచే దురితపుంజము నంతయును భస్మీకృతముగాఁ జేయుచున్నానని తాత్పర్యము. ఈ మంత్రమును జెప్పి జలప్రాశనము చేయవలయును. ఇందులకు:—

"సూర్యశ్చేత్యనువాకేన హ్యాపః పీత్వా సమాహితః,
ప్రాతఃకాలే విశుద్ధాత్మా కర్మణ్యో భవతి ద్విజః"

అనువచనము ప్రమాణము.

సూర్య శ్చేత్యనువాకముయొక్క అర్థ మీా దిగువను వ్రాయఁబడిన శ్లోకములచే సంగ్రహింపఁబడినది.

"సూర్యో మన్యుశ్చ మామన్యుపతయో మన్యుజాదఘాత్,
ముంచంతు హ స్తపచ్ఛిశ్న మనోవాగుదరై రపి.
రాత్రా వకార్షం పాపం యద్రాత్రి రేవావలుంపతు,
అబుద్ధికృతమ ప్యేనో యత్కించి ద్దురితం మయి.
తచ్చాపి ంత్యర్థ మహంసూర్యేజుహోమి జ్యోతిషి స్వయం,
ప్రతిపాద్యామృతయోనౌ మాంముచ్యేయంమృత్యుబంధనాత్."

కేశవాదినామములఁ జెప్పి మరల నాచమనము చేసి.

మూ॥ దధిక్రావ్ణో అకారిషమ్। జిష్ణో రశ్వస్య వాజినః। సుర భినో ముఖాకర త్ప్రణ ఆయూగ్ంషి తారిషత్। ఆపో హి ష్ఠా మయో భువ స్తా న ఊర్జేదధాత న। మహేరణాయ చక్షసే। యోవ శ్శివతమో రస స్తస్య భాజయతేహ నః। ఉశతీరివ మాతరః। తస్మా అరంగమామవో యస్య క్షయాయజిన్వథ। ఆపో జనయథా చ నః.

టీ. దధిక్రావ్ణ ఇత్యాది. దధీని హవీంషి క్రామతీని వా క్రామతి గచ్ఛతీతి దధిక్రావా, దధి=హవిస్సులను, క్రావ్ణః= పొందువాఁడు, జిష్ణోః=జయశీలుఁడు, అశ్వస్య=వ్యాపకుఁడు లేక "అగ్ని ర్దేవేభ్యోనిలాయత-అశ్వరూపం కృత్వా" (అశ్వరూపము ధరించి అగ్ని దేవతలనుండి దాఁగియుండెను.) అను శ్రుతినిబట్టి అశ్వరూపుఁడు, వాజినః=అన్నముకలవాఁడు (ఇందులకు "అగ్ని ర్వా అకామయత, అన్నాదో దేవానాం స్యామితి" అనుశ్రుతి ప్రమాణము.) అయిన అగ్నియొక్క స్తోత్రమును

అకారిషమ్ = చేయుదునుగాక, అతనికింకరుఁడ నగుదునుగాక ("అకారిషమ్" అను క్రియాపదమందలి రేఫమున కికారము వచ్చుట ఛాందసము) నః=మాయొక్క, ముఖా=ముఖములను, సురభి=(సురభీణి) పరిమళయుక్తములనుగా, కరత్ (కరోతు=) చేయునుగాక, (మాముఖములను పరిశుద్ధములుగాఁ జేయును గాక యని తాత్పర్యము) నః = మాయొక్క, ఆయూంషి = ఆయుష్యములను, ప్రతారిషత్ = ప్రకృష్టముగా వృద్ధినొందించును గాక. ఈ మంత్రార్థమును జెప్పు ప్రాచీన శ్లోకములు.

"దధిక్రావా రవి ర్వహ్ని ర్దధిక్రామతి యజ్జగత్,
జయవ్యాప్తిజవై ర్యోగా జ్జిష్ణో రశ్వస్య వాజినః.
అకారిషం స్తుతిం కుర్యాం తస్య సంబంధినీం తథా,
సురభీణి సుశుద్ధాని ముఖాని సకరోతు నః.

ప్రతారిషత్ప్రదద్యాచ్చ పూర్ణాన్యాయూంషి నః ప్రభుః."

ఈ మంత్రమునకు సూర్యపరముగాఁ గూడ నర్థమున్నది. ఆ పక్షమందు (దధిక్రావ్ణః = లోకయాత్రా నిర్వాహకుఁడు, జిష్ణోః=జయశీలుఁడు, అశ్వస్య = వ్యాపకుఁడు, వాజినః= వేగముగలవాఁడునగుసూర్యునియొక్క) అని చెప్పవలెను. మంత్రశేషమునకు మొదటియర్థమే. ఈమంత్రము నుచ్చరించిన పిమ్మట నేమార్జనము చేసికొనవలయు నని శిష్టాచారము. ఈమంత్రోచ్చారణమునకు ముందు మార్జనము చేసికొన్న యెడల బ్రహ్మహత్యా మహాపాతకము సంభవించు ననియు, కొనను చేసిన యెడల నశ్వమేధఫలము లభించు ననియు స్మృతులు వలుకుచున్నవి.

"అష్టాక్షరం నవపదం పఠేద్దా బ్రహ్మహా భవేత్,
పదాన్తే ప్రక్షిపే త్తోయ మశ్వమేధఫలం లభేత్."

మఱికొన్ని మార్జనమంత్రములు.

మూ॥ హిరణ్యవర్ణా శ్శుచయః పావకా యాసు జాతః కశ్యపో యా స్వింద్రః। అగ్నిం యా గర్భం దధిరే విరూపా స్తాన ఆప శ్శగ్ం స్యోనా భవంతు.

టీ. ఏ యుదకములు, హిరణ్యవర్ణాః=సువర్ణచ్ఛాయ గలిగినవియు, శుచయః=పరిశుద్ధములును, పావకాః=పవిత్రతను గలిగించునవియును అగుచున్నవో, యాసు = ఏ యుదకముల యందు, కశ్యపః=కశ్యపుఁడను ప్రజాపతి లేక వర్ణ వ్యత్యాసముచే "కశ్యపశబ్దము" "పశ్యక" అని అగుచున్నది. "పశ్యతీతి పశ్యకః" అనువ్యుత్పత్తిచేఁ జూచువాఁ డనియర్థము. అనఁగా సర్వలోకసాక్షి యగుసూర్యుఁడు, జాతః = పుట్టెనో, (యోఽముష్య తపత ఆయతనంవేద ఆయతనవా న్భవతి ఆపో వా అముష్య తపత ఆయతనమ్) అని సూర్యున కుదకోత్పత్తి శ్రుతియందుఁ జెప్పఁబడియున్నది. యాసు = ఏ యుదకములయందు, ఇంద్రః=సురేశ్వరుఁడు, జాతః=పుట్టెనో,విరూపాః=నానారూపములుగల, యాః=ఏ యుదకములు, అగ్నిమ్ = బడబాగ్నిని, గర్భందధిరే = కుక్షియందు ధరించినవో, (తృతీయమప్సునృమణాః, అజస్రమింధాన ఏనం జరతే స్వాధీః) అను శ్రుతి యిందులకుఁ బ్రమాణము. తాః=ఆ యుదకములు, నః=మాకు, శమ్=సుఖహేతువులును, స్యోనాః=అవైషయిక సౌఖ్యజనకములును, భవంతు=అవునుగాక లేక, శమ్ = దుఃఖమును

శమింపఁజేసి, స్యోనాః=సుఖమును కలుగఁజేయునవి, భవంతు= అవును గాక.

మఱియొక మార్జనమంత్రము.

మూ॥ యాసాగ్ం రాజావరుణో యాతి మధ్యే సత్యానృతే। అవపశ్యం జనానామ్ మధుశ్చుతః। శుచయో యాః పావకా స్తా న ఆపః శగ్ం స్యోనం భవంతు.

టీ. రాజా=దండధరుఁడగు, వరుణః = వరుణుఁడు, జనానామ్ = జనులయొక్క, సత్యానృతే = పుణ్యపాపములను, అవపశ్యన్=వివేచించుచు, యాసాం మధ్యేయాతి = ఏయుదకముల మధ్యను నివసించుచున్నాఁడో, మధుశ్చుతః= తేనెను స్రవించునవియు, శుచయః = పరిశుద్ధములును, పావకాః=పవిత్రతను కలుగఁజేయునవియును అగునో, తాః ఆపః=ఆయుదకములు, నః=మాకు, శమ్=సుఖహేతువులును, స్యోనాః = అద్వైతమయిక సుఖజనకములును, భవంతు=అవునుగాక.

మూ॥ యాసాం దేవా దివి కృణ్వంతి భక్షం యా అంతరిక్షే బహుధా భవంతి। యాః పృథివీం పయసోందంతి శుక్రా స్తాన ఆప శ్శగ్ం స్యోనా భవంతు॥

టీ. దివి=అంతరిక్షమందు, దేవాః=దేవతలు, యాసాం అపామ్=ఏయుదకములయొక్క, భక్షమ్=భక్షణమును, కృణ్వంతి=చేయుచున్నారో, యాః=ఏయుదకములు, అంతరిక్షే=అంతరిక్షమందు, బహుధా=అనేకప్రకారములుగా, భవంతి=ఉండుచున్నవో, యాః=ఏజలములు, పృథివీమ్=భూమిని, పయసా = వృష్టిచే, ఉందంతి = తడుపుచున్నవో, (సర్వలోకానుగ్రహార్థ

మఱి భూమిని వర్ష ధారలచేఁ దడుపుచున్నవని భావము) శంభ్రాః = శుభ్రములయిన, తాః ఆపః=ఆయుదకములు, నః= మాకు, శగ్‌స్యోనా భవంతు=అవై యుకసుఖజనకము లగును గాక.

మూ॥ శివేన మా చక్షుషా పశ్యతాఽపః శివయా తనువో పస్పృశత త్వచం మే సర్వాగ్ అగ్నీగ్ రప్సుషదో హువే మయి వర్చో బల మోజో నిధత్త॥

టీ. హే ఆపః=ఉదకములారా, శివేన=సుఖరూపమైన, చక్షుషా = కంటిచేతను, మా=నన్ను, పశ్యత = చూడుఁడు. (నాయందు సంతతము విస్తారమగు కరుణాదృష్టి నుంచుఁడు) శివయా తనువా=మంగళమగు మీశరీరముచే, మే త్వచమ్= నా (త్వక్కును) శరీరమును, ఉపస్పృశత = ముట్టుకొనుఁడు. హేఆపః=ఉదకములారా, వః=మీయొక్క, అప్సుషదః=ఉదక ములయందున్న, సర్వానగ్నీన్ = బడబాగ్ని మొదలగు నగ్నుల నన్నింటిని, హువే=పిలుచుచున్నాను, మయి=నాయందు,వర్చః= వర్చస్సును, బలమ్ = శక్తిని, ఓజః=ఉత్సాహమును, నిధత్త= ఉంచుఁడు.

"అగ్నీగ్ రప్సుషదః" అనుస్థలమందు త్రిభాష్యోక్త మగు "ఈకారపూర్వత్వాన్న కారో రేఫభావ మాపద్యతే" అను వచనమునుబట్టి ఈకారపూర్వమగు నకారము రేఫ ము [ర] గా మాఱినది.

ఈరీతిగా మార్జనము చేసికొని పాపపురుషవిసర్జనము కొఱకు దక్షిణహస్తమం దుదక ముంచుకొని, నాసికాగ్ర

మును పొందించి వామపార్శ్వమునం బాజలమును భూమిపైని విడిచి దానివైపు చూడఁగూడదు. వసిష్ఠస్మృతియం దిట్లు చెప్పఁబడియున్నది:—

"గృహీత్వా పాణినా వారి స్వశాఖోక్తామృచం జపేత్,
ఉద్ధృత్య దక్షిణే హస్తే జలం గోకర్ణవత్కృతే,
నిధాయ నాసికాగ్రేతు పాపపూర్ణం చ సంస్మరేత్,
బిభృయాన్నాసికాయాం తు నిరుద్ధప్రాణమార్గతః,
వామే నిక్షిప్య మేదిన్యాం తజ్జలం నావలోకయేత్."

ఇట్లు చేయునపుడు చెప్పవలసిన మంత్రము.

మా॥ ద్రుపదాదివ ముంచతు ద్రుపదాత్ విన్నముచానః।
స్విన్నస్స్నాత్వీమలాదివ। పూతం పవిత్రేణై వాజ్యమ్।
ఆపశ్శుంధంతు మైనసః॥

టీ. ద్రుపదాదివ=(అపరాధముచేయువారి కాళ్లకుఁ దగిలించు) కఱ్ఱబొండనుండివలెను, ఆపః = ఉదకములు, ఏనసః=పాపమునుండి, మా=నన్ను, శుంధంతు=పవిత్రునిగాఁ జేయును గాక. ఎట్లన, దీనికి మూఁడుదృష్టాంతములు తెలుపఁబడినవి. ద్రుపదాత్ = కఱ్ఱబొండనుండి, ఇన్నముచాన ఇన=విడిపింపఁబడినవాఁడువలెను, స్విన్నః = చెమటపట్టినవాఁడై, స్నాత్వీ=స్నానముచేసినవాఁడు, మలాదివ=శరీరమందు పట్టినమురికినుండి వలెను,పవిత్రేణ=దర్భలచే, పూతమ్=పవిత్రముగాఁ జేయఁబడిన, ఆజ్యమివ=నేయివలెను, మామ్=నన్ను, ఆపః=ఉదకములు, ఏనసః=పాపమునుండి, శుంధంతు=శుద్ధునిగాఁజేయునుగాక.

ఈ మంత్రములకన్నిటికిని పూర్వులు రచించిన శ్లోకములు:—

"అద్భ్యో జాతౌ కశ్యపేంద్రా వగ్నిం వైద్యుతబాడబమ్,
గర్భం యా దధిరే నానారూపాః స్థితివశేన తాః,
శం దుఃఖం శమయిత్వా నస్స్యన్నా స్సంతు సుఖప్రదాః,
యాసాం మధ్యే దండధరః పుణ్యపాపే వివేచయన్,
వరుణో యాతి మధురస్యందిన్యః పూర్వవత్పరమ్,
యాసా మమృతరూపాణాం భక్షణం కుర్వతేఽమరాః,
సృష్ట్యాత్మనా యా బహుధా ఖేచ యాః పృథివీమపి,
పయసా తద్గతాకారై స్సించంతీతి త్రిలోకగాః,
శుక్రా విశుద్ధా స్తా ఆప శ్శంముదా స్సంతు శర్మదాః,
ఆపః కల్యాణదృష్ట్యా నూం పూత స్స్య ఇతి పశ్యత,
తనువా సౌమ్యయా మూర్త్యా స్స్పృశతాంగంచ మామకమ్
ఆహ్వయామ్యప్సు వసతో వహ్నీన్నో బాడబాదికాన్,
ఆపో యూయం యశో వర్చో బల మోజో నిధత్త వై."

ఇంతవఱకు సంధ్యాత్రయమునకును సమానమే. జలప్రాశనమంత్రములు వేఱువేఱుగానున్నవి. మొదటను "ఆపోహిష్ఠేతి" తొమ్మిదిఖండములతో మార్జనము రెండవసారి కూడ నట్లే. ఇతరమార్జనమంత్రములగు "హిరణ్యవర్ణా శ్శుచయః పావకాః" ఇత్యాదుల నన్నింటిని ఉచ్చరించి కొనను మార్జనము చేసికొనవలెను.

## అర్ఘ్యప్రదానప్రకారము.

మూఁడు కాలములయందును అర్ఘ్యప్రదానము చేయవలయును. సాయంప్రాతః కాలములయందు ముమ్మా ఱర్ఘ్య

ము విడువవలెను. మధ్యాహ్నమం దొక్కమాఱే. ఈయర్ఘ్య ప్రదానము కాల మతిక్రమింపకుండఁ జేయవలెను. కాల మతిక్రమించినయెడల నందులకుఁ బ్రాయశ్చిత్తముగాఁ బ్రాణాయామమును, అర్ఘ్యప్రదానమును జేసి యనంతరం మర్ఘ్య ప్రదానము చేయవలెను. ఇందులకు విధాన మిట్లు వ్రాయఁబడినది. విధ్యుక్తముగా నాచమించి తనశక్తికొలఁది ప్రాణాయామ మొనర్చి "మమ (ప్రాతర్మధ్యాహ్నసాయం) సంధ్యాకాలాతిక్రమణ దోషపరిహారార్థం ప్రాయశ్చిత్తార్ఘ్యపూర్వక మర్ఘ్యప్రదానం కరిష్యే" అని సంకల్పము చెప్పి శిరోమంత్రముతోను వ్యాహృతులతోను గూడినగాయత్రీమంత్రముచే నొకమాఱు ప్రాయశ్చిత్తార్ఘ్యమును విడువవలెను.

"నియమాతిక్రమణే చాన్యస్మిన్" అను సూత్రకార వచనమువలనఁ బ్రాయశ్చిత్తముగాఁ బ్రాణాయామము చేయవలయును.

"ఆచాన్తో విధివత్ప్రాణా నాయమ్య చతురర్ఘ్యకమ్,
కాలాతీతవిశుద్ధ్యర్థం దత్వా సంధ్యాం సమాచరేత్."

అని స్మృతివచనము.

"ఏవం సంమార్జనం కృత్వా బహిశ్శుద్ధ్యర్థకారకః,
తతోఽభ్యంతరశుద్ధ్యర్థం ప్రాణాయామంసమాచరేత్."

అని షట్కర్మచంద్రిక. ఇచ్చట నిది సిద్ధాంతము. కాలాతిక్రమణమందు సంధ్యావందనము చేయునపు డొక ప్రాయశ్చిత్తార్ఘ్య మీయవలెను. అనంతరము సాయం ప్రాతఃకాలములయందు ముమ్మాఱు అర్ఘ్య మొసఁగవలెను.

ప్రాయశ్చిత్తార్ఘ్యమును విడువకమును ప్రాకప్రాణాయామము చేయవలెను. అర్ఘ్యప్రదాన మిట్లు చేయవలెను.

"ప్రాఙ్ముఖ స్సతతం విప్ర స్సంధ్యోపాసన మాచరేత్,
అర్ఘ్యప్రక్షేపణం కుర్యాదాదిత్యాభిముఖో ద్విజః."

బ్రాహ్మణుఁ డెల్లపుడును తూర్పువైపు తిరిగి సంధ్య నుపాసింపవలెను. సూర్యాభిముఖుఁడై యర్ఘ్యమును విడువవలెను.

"ప్రాతః ప్రహ్వః క్షిపే దప్సు మధ్యాహ్నే ఋజుసంస్థితః,
అర్ఘ్యప్రక్షేపణం కుర్యా త్సాయం తూపవిశ న్భువి."

ప్రాతఃకాలము వంగియు మధ్యాహ్నము తిన్నఁగా నిలువఁబడియు, సాయంకాలము భూమిపయిని కూర్చుండియు అర్ఘ్యమును విడువవలెను.

"పాణిభ్యాం జలమాదాయ గాయత్ర్యా చాభిమంత్రితమ్,
గోశృఙ్గమాత్ర ముద్ధృత్య జలమధ్యే జలం క్షిపేత్."

గాయత్రీమంత్రముచేనభిమంత్రితమగుజలమునుఆవు కొమ్మంత యెత్తుగా దోసిలితోఁ దీసి నీటిలో విడువవలెను.

"జలే త్వర్ఘ్యం ప్రదాతవ్యం జలాభావే తు తత్ స్థలే,
సంప్రోక్ష్య వారిణా సమ్య క్ప్రశ్చా దర్ఘ్యం యథావిధి."

ప్రాతర్మాధ్యాహ్నిక సంధ్యావందనములయందే నీటి యం దర్ఘ్యమును విడువవలయును గాని సాయంసంధ్యయం దట్లు చేయఁగూడ దని స్మృతి నిషేధించుచున్నది.

"ఉపవిశ్య తు సాయాహ్నే జలే త్వర్ఘ్యం న నిక్షిపేత్,
నిక్షిపేద్యది మూఢాత్మా రౌరవం నరకం వ్రజేత్."

సాయంకాలము కూర్చుండి భూమిపైనే అర్ఘ్యము‌ను విడువవలయును. జలమందు విడిచినయెడల రౌరవ మనునరకమును పొందును.

"తర్జన్యంగుష్ఠయోగేన రాక్షసీ ముద్రికా భవేత్,
యో దదాతి తయా చార్ఘ్యం తత్తోయం రుధిరం భవేత్."

అర్ఘ్యప్రదానమందు తర్జనిని అంగుష్ఠమును కలుపఁ గూడదు. అట్లు కలిపి అర్ఘ్య మిచ్చినచో నాజలము రక్తమగును.

ప్ర ద క్షి ణ ము.

అర్ఘ్యప్రదానమైనతరువాత "యత్ప్రదక్షిణం ప్రక్రమంతి తేన పాప్మాన మవధూన్వంతి" అనుశ్రుతిచొప్పున "అసావాదిత్యో బ్రహ్మ" అను మంత్రము నుచ్చరించుచు జలమును గ్రహించి ప్రదక్షిణము చేయవలయును.

"ప్రదక్షిణ మనువ్రజ్య వాచయే త్సంధ్యయో ర్ద్వయోః"
ఈప్రదక్షిణము మూఁడుసంధ్యలయందును సమానము.

స ం ధ్యా ం గ త ర్ప ణ ము.

"క్రమాత్సంధ్యాంచగాయత్రీం బ్రాహ్మీంచనిమృజీంతథా,
తర్పయామీతి వక్తవ్యం చతస్రో దేవతాః క్రమాత్."

అను వచనమునుబట్టి అర్ఘ్యప్రదానము ప్రదక్షిణము అయినతరువాత సంధ్యాంగతర్పణము చేయవలెను. అందుకొఱకు ఆచమించి ప్రాణాయామము చేసి "మమ దురితక్షయార్థం పరమేశ్వరప్రీత్యర్థం ప్రాతస్సంధ్యాంగతర్పణం కరిష్యే" అని సంకల్పము చెప్పి, "సంధ్యాం తర్పయామి,

గాయత్త్రీం తర్పయామి, బ్రాహ్మీం తర్పయామి, నిమృజీం తర్పయామి'' అని ప్రాతఃకాలసంధ్యయందును ''సంధ్యాం తర్పయామి, సావిత్రీం తర్పయామి, రౌద్రీం తర్పయామి, నిమృజీం తర్పయామి'' అని మాధ్యాహ్నికసంధ్యయందును, ''సంధ్యాం తర్పయామి, సరస్వతీం తర్పయామి, వైష్ణవీం తర్పయామి, నిమృజీం తర్పయామి'' అని సాయంసంధ్యయందును తర్పణము చేయవలయును.

మరల నాచమనము చేసి గాయత్రీమంత్ర జపమునకు ముందు.

మూ॥ ఓమిత్యేకాక్షరం బ్రహ్మ, అగ్నిర్దేవతా, బ్రహ్మ ఇత్యార్షమ్, గాయత్త్రం ఛందః, పరమాత్మం సరూపమ్,సాయుజ్యం వినియోగమ్.

అనెడుగాయత్రీహృదయమును పఠింపవలెను.

టీ. ఓమిత్యేకాక్షరం బ్రహ్మ = ''ఓమ్'' అనునక్షరమును పరబ్రహ్మముగా ధ్యానింపవలెను. ''ఓమ్'' అనుదానిరూపనిష్పత్తి లోఁగడ వ్రాయఁబడినది. ఇప్పుడిచట మఱియొకవిశేషము వ్రాయఁబడుచున్నది.

''యోఽయం పరమహంసాఖ్యో మంత్రస్సోహమితీరితః,
సహాభ్యాం లోపేఽస్య పూర్వత్వే సంధా వోమితి జాయతే.
అకారశ్చ తథోకారో మకారశ్చాత్రవర్ణకాః.''

''యోహం సోహం'' అను దానికి పరమహంసమంత్రమని పేరు. ఇందులో ''సోహమ్'' అనుదానిలో సకారహకారములు లోపింపఁగా పూర్వరూపసంధి చేసినపుడు ''ఓమ్'' అను

రూపము సిద్ధించును. బ్రహ్మమును ధ్యానించుచు "ఓమిత్యే కాక్షరమ్" అనుదానిని జపింపవలెనను విషయమై శ్రీశంకరాచార్యులవా రిట్లు పలుకుచున్నారు.

"ఓమిత్యేకాక్షరం బ్రహ్మ ధ్యాయన్మనసి వై జపేత్ ద్విజః,
అవాప్తసర్వకామోఽసౌ నాత్మనాత్మానమీక్షతే."

"ఓమిత్యేకాక్షరంబ్రహ్మ" అనుదానికి ఋషిచ్ఛందో దైవతములను జెప్పుచున్నాఁడు.

"అగ్నిర్దేవతా"=అగ్నిః=అంగతి సకలవేదాంతప్రతిపాద్యత్వం గచ్ఛతీత్యగ్నిః పరమాత్మా "అంగేర్నలోపశ్చ" అను ఔణాదికసూత్రముచే నకారలోపము నిప్రత్యయము రాఁగా "అగ్ని" అని సిద్ధించినది. కావున నా ప్రణవమునకు నగ్నిశబ్దవాచ్యుఁడగు పరమాత్మ అధిదేవత. "బ్రహ్మ ఇత్యార్షమ్" సని బ్రహ్మము ఋషి, "గాయత్రం ఛందస్"=గాయత్రీఛందస్సు, "పరమాత్మం సరూపమ్"=పరమాత్మ దాని స్వరూపము, "సాయుజ్యం వినియోగమ్"=ఈమంత్రమునకు మోక్షమందు వినియోగము. ఇట్లు ప్రణవస్వరూపమును తెలిసికొనవలెను. శ్రీశంకరాచార్యులవా రిట్లు చెప్పుచున్నారు.

"ప్రణవేబ్రహ్మఋషిఃప్రోక్తశ్ఛందో గాయత్రముచ్యతే,
పరమాత్మాదేవతాఽయం మోక్షాదౌ వినియుజ్యతే."

ఇఁక సకలదేవతామాత యగు గాయత్రిని ప్రార్థించుచున్నాఁడు.

మూ॥ ఆయాతు వరదా దేవీ అక్షరం బ్రహ్మసమ్మితమ్,
గాయత్రీం ఛందసాం మాతేదం బ్రహ్మ జుషస్వ

మే, యదహ్నాత్కురుతే పాపం తదహ్నాత్ప్రతిము చ్యతే, యద్రాత్రియా త్కురుతే పాపం తద్రాత్రి యాత్ప్రతిముచ్యతే, సర్వవర్ణే మహాదేవి! సంధ్యా విద్యే !సరస్వతి!.

టీ. వరదా = ఉపాసకుల కభీష్టము లొసంగు, దేవీ = గాయత్త్రి, ఆయాతు=మాకడకు వచ్చునుగాక.

పిమ్మట గాయత్త్రిని స్తుతించుచున్నాఁడు.

అక్షరమ్=నాశరహితమును, సమ్మితమ్=వేదాన్తప్రమాణముచే నిశ్చితమును అగు, బ్రహ్మ=పరబ్రహ్మము నీవే, ఛందసాం మాతా=వేదములకుఁ దల్లియైన, గాయత్త్రి సకలవేదసారభూతము. ఇందుల కాపస్తంబసూత్రమందు "సర్వేభ్యో వై వేదేభ్యో*గాయత్ర్యనూచ్యతే."

"త్రిభ్య ఏవ తు వేదేభ్యః పాదపాద మదూదుహత్,
తదిత్యృచోఽస్యాస్సావిత్ర్యాః పరమేష్ఠీ ప్రజాపతిః".

గాయత్త్రీమ్=గాయత్త్రి[ప్రథమార్థమందు ద్వితీయ] ఇదమ్ = నాచేఁ జేయబడిన స్తోత్రరూపమగు, బ్రహ్మ = తపస్సును, జుషస్వ = అనుగ్రహించుము. ఓగాయత్త్రి! నీవు నాయొద్దకు వచ్చి నన్ననుగ్రహించి నాచేఁ జేయఁబడిన స్తోత్రమును స్వీకరింపు మని తనచేఁ జేయఁబడిన దానిని గాయత్త్రిదేవి కర్పణచేయుచున్నాఁడు.

దీనికి మఱియొకరీతిగా నర్థము చెప్పఁబడియున్నది.

ఛందసాంమాతా=సకలవేదములకును తల్లివిని, గాయత్త్రీమ్=గాయత్త్రీశబ్దవాచ్యురాలవును అగుపరదేవతా!, మే=

నాకు, ఇదం బ్రహ్మ=వేదాంతప్రతిపాద్యమగు పరబ్రహ్మ తత్త్వమును, జుషస్వ=ఉపదేశింపుము.

అట్లుపదేశించుటవలనఁ దాను పొందు ఫలమును చెప్పుచున్నాఁడు.

అహ్నాత్ = పగటియందు, యత్పాపమ్=ఏపాపమును, కురుతే = చేయుచున్నాఁడో, తత్ = ఆపాపము, అహ్నాత్ = పగటియందే, ప్రతిముచ్యతే = (ఉపాసకునిచే) విడువఁబడు చున్నది. రాత్రియాత్ = రాత్రియందు, యాత్ = ఏ పాపమును, కురుతే=చేయుచున్నాఁడో, తత్ = ఆ పాపము, రాత్రియాత్ = రాత్రియందే, ప్రతిముచ్యతే=విడువఁబడుచున్నది.

గాయత్రికి సర్వాత్మకత్వమును ప్రతిపాదించుచు విశేషముగాఁ బ్రార్థించుచున్నాఁడు.

సర్వవర్ణే = సకల వర్ణములుగలదానా! మహాదేవి = మహాదేవీ!, సంధ్యావిద్యే = సంధ్యావిద్యా!; సరస్వతి! = ఓ సరస్వతీ! అని గాయత్రికి సంబోధనము.

మూ. ఓజోసి సహోసి బలమసి భ్రాజోసి దేవానాం ధామ నామాసి విశ్వమసి విశ్వాయుః సర్వమసి సర్వాయు, రభిభూరోం గాయత్రీమావాహయామి, సావిత్రీమావాహయామి, సరస్వతీమావాహయామి, ఛందర్షీనావాహయామి, శ్రియమావాహయామి, గాయత్రియా గాయత్రీఛందో విశ్వామిత్ర ఋషిః, సవితా దేవతాగ్నిర్ముఖం, బ్రహ్మ శిరో విష్ణుర్హృ

దయం, రుద్రశ్శిఖా, పృథివీ యోనిః, ప్రాణాపాన
వ్యానోదానసమానాసప్రాణా, శ్వేతవర్ణా సాంఖ్యా
యనసగోత్రా గాయత్రీ చతుర్వింగ్ శత్యక్షరా
త్రిపదా షట్కుక్షిః పంచశీర్షోపనయనే వినియోగః.

టీ. ఇట్టిదానవైన ఓదేవీ ! నీవు, ఓజోసి = మాయింద్రియములయొక్క శక్తి వైయున్నావు. సహోఽసి = శత్రువులను తిరస్కరించుశక్తివై యున్నావు. బలమసి = శరీరబలమగుచున్నావు. భ్రాజోఽసి = దీప్తివగుచున్నావు. దేవానామ్ = అగ్నీంద్రాది దేవతలయొక్క,. యద్ధామ = ఏ తేజస్సుకలదో, తన్నామాసి = ఆయాయిదేవతల పేర్లు కలదానవు నీవే [తేజోవంతులగు ఏయింద్రాది దేవతలు కలరో వారు నీవే యనుట], లేక, దేవానామ్ = దేవతలయొక్క, ధామ = నివాసభూమివి, అసి = అగుచున్నావు. ఈయర్థమందు "నామ" అనుపదము ప్రసిద్ధిని తెలియఁజేయును. [సర్వదేవతలకును ఆశ్రయభూమి వగుచున్నావు]. విశ్వమసి = సర్వజగద్రూపవు నీవే అగుచున్నావు. విశ్వాయుః = సంపూర్ణాయుస్స్వరూపమవగుచున్నావు. "సర్వమసి, సర్వాయుః" అనుదానికిఁగూడ నిదియే అర్థము, లేక, విశ్వమసి=సమస్తస్థావరజాతము నీవే అగుచున్నావు. విశ్వాయుః= ఆస్థావరజాతముయొక్క ఆయుష్యముకూడ నీవే అగుచున్నావు. [ఇచ్చటి ఆయుశ్శబ్దమునకు స్థితికాల మర్థము గాని ప్రాణవాయు సంచారము కాదు], సర్వమ్ = నిఖిలచేతన సమూహము, అసి = నీవే అగుచున్నావు. సర్వాయుః = సకలచేతనుల - ఆయుష్యము నీవే, అభిభూః = సకలపాపము

లను తిరస్కరించెదు, ఓమ్ = ప్రణవప్రతిపాద్యమగు పరమాత్మస్వరూపమ వగుచున్నావు. [సర్వాత్మకుండగు పరమేశ్వరుని బ్రతిపాదించునది గావున పైని చెప్పఁబడిన దంతయు గాయత్త్రి కుపపన్న మగుచున్నది] ఇట్టి, గాయత్త్రీమ్ = గాయత్త్రిని నామమనస్సునం దుపాసించుటకు, ఆవాహయామి = ఆహ్వాన చేయుచున్నాను. ఈగొగా సావిత్ర్యాదిరూపముతో గాయత్త్రికే ఆవాహనము. గాయత్త్రి యనియు, సావిత్రి యనియు, సరస్వతి యనియు సంధ్యాదేవతకే నామము లని పరాశరమాధవీయమందుఁ జెప్పఁబడి యున్నది.

"గాయత్త్రీనామ పూర్వాహ్ణే సావిత్రీ మధ్యమే దినే,
సరస్వతీచ సాయాహ్నే సైవ సంధ్యా త్రిధా మతా."

సంధ్యాదేవతకు కాలభేదముచే నీనామభేదము సంభవించినది. గ్రంథాంతరమం దీమూఁడునామములును ఇట్లు నిర్వచింపఁబడినవి.

"గాయత్త్రీప్రోచ్యతే తస్మా
ద్గాయంతం త్రాయతేయతః.

సవితృద్యోతనాత్సైవ సావిత్రీ పరికీర్తితా,
జగతః ప్రసవిత్రీ వా వాగ్రూపత్వా త్సరస్వతీ."

ఛందర్షీ నావాహయామి, ఛందర్షీ = గాయత్త్ర్యాది ఛందస్సులను, విశ్వామిత్త్రాది ఋషులను, ఆవాహయామి = ఆవాహనచేయుచున్నాను.

ఇఁక గాయత్త్రికి ఛంద ఋషి దేవతాది స్వరూప మును కనుపఱుచుచున్నాఁడు.

గాయత్త్ర్యాః = గాయత్త్రికి, గాయత్త్రీ = గాయత్త్రి, ఛందః = ఛందస్సు, విశ్వామిత్త్ర ఋషిః = విశ్వామిత్త్రుఁడు ఋషి, సవితా దేవతా = సూర్యుఁడు దేవత.

గాయత్త్రీస్వరూపమును జెప్పుచున్నాఁడు.

అగ్నిర్ముఖమ్ = ముఖ మగ్ని, బ్రహ్మ శిరః = శిరస్సు బ్రహ్మ, విష్ణుః = విష్ణువు, హృదయమ్ = హృదయము, రుద్ర శ్శిఖా = శిఖ రుద్రుఁడు, పృథివీ యోనిః = యోని భూమి, ప్రాణాపానవ్యానోదానసమానా = పంచప్రాణాత్మక మైనది, సప్రాణా = దేవదత్త, కూర్మ,ధనంజయ, నాగ, కృకరము లనెడియుపప్రాణములతోఁ గూడినది. శ్వేతవర్ణా = శ్వేతవర్ణముగలది. [గాయత్త్ర్యాదిభేదముచే రక్తవర్ణయు, కృష్ణవర్ణయుఁగూడ నగుచున్నది].

"గాయత్త్రీ తు భవేద్రక్తా సావిత్రీ శుక్లవర్ణికా,
సరస్వతీ తథా కృష్ణా ఉపాస్యా వర్ణ భేదతః."

ఇట్టిగాయత్త్రికి గోత్ర మెద్ది యనఁగా:—సాంఖ్యాయనసగోత్రా = సాంఖ్యాయనుఁడను ఋషితో సమాన మైన గోత్రముగలది. చతుర్వింశత్యక్షరా = ఇరువదినాలుగక్షరములుకలది. త్రిపదా = ఋగ్యజుస్సామవేదములనెడి మూఁడుపాదములుకలది. షట్కుక్షిః = తూర్పు, పడమర, దక్షిణము, ఉత్తరము, ఊర్ధ్వదిశ, అధోదిశ, అనెడు ఆఱు దిక్కులును కుక్షిగాఁగలది. పంచశీర్షా = శిక్ష, వ్యాకరణము,

కల్పము, నిరుక్తము, జ్యోతిషము అనునవి శిరస్సులుగాఁ గలది దీని కెచ్చట వినియోగము? ఉపనయనే = ఉపనయన మందు, ఉపనయన మనఁగా "ఉప-సమీపే, నయన ముపన యనమ్." [వేదాధ్యయనమునకొఱకు గురువునొద్దకు, తీసికొని వెళ్లుట]. మఱికొందఱు "గర్భాష్టమే వర్షే వసంతే బ్రాహ్మణ ఆత్మాన ముపమానయస్వేతి బ్రూయాత్" అనుబోధా యనవచనము నుదాహరించుచున్నవారై ఉపనేతను గూర్చి నన్ను పొందింపు మని ఉపనేయుఁడు పలుకుమాట యని చెప్పుదురు.

## గాయత్రీమంత్రజపము.

"కుశబ్రుస్యాం సమాసీనః కుశోత్తరాయాం వా
కుశపవిత్రపాణిః, పశ్చిమాభిముఖ స్సూర్యాభిముఖో వా
అక్షమాలా మాదాయ దేవతాం ధ్యాయ న్గాయత్రీజపం
కుర్యాత్."

అని శంఖస్మృతిలోఁ జెప్పఁబడినట్లు దర్భలతోఁ జేయఁబడిన ఆసనమందుఁ గాని లేక, దర్భలు పరచఁబడిన ఆసనమందుఁగాని కూర్చుండి కుశపవిత్రము చేత నుంచుకొని సూర్యాభిముఖుఁడై కాని పశ్చిమాభిముఖుఁడై కాని జపమా లికను చేతితోఁ బట్టుకొని గాయత్రీమంత్ర ప్రతిపాద్య దేవ తను ధ్యానించుచు మంత్రజపము చేయవలయును. జపమునకు ముందు శ్రుత్యాచమనము గాని స్మృత్యాచమనము గాని చేసి స్థిరచిత్తుఁడై శుభమగు ప్రదేశమందుఁ గూర్చుండి జప మారంభింపవలెను.

"ఆచమ్య ప్రయతో నిత్య ముభే సంధ్యే సమాహితః,
శుభే దేశే జపం జప్య ముపాసీత యథావిధి."

అని మనువు చెప్పుచున్నాఁడు. ఉపనయనకాలమం దట్లు పదేశింపఁబడుటవలన ప్రణవవ్యాహృతులతోఁ గూడ గాయత్రిని జపింపవలయు నని శంఖుఁడు పలుకుచున్నాఁ డను హేతువువలన పాదములు గాను అర్ధర్చలు గాను ఉచ్చరించుట నిత్యజపమందుఁగూడ సంభవింపవచ్చును. కాని; అది సరికాదు.

"ఓంకారం పూర్వ ముచ్చార్య భూర్భువస్స్వ స్తథైవచ,
గాయత్రీం ప్రణవం చాంతే జప ఏవ ముదాహృతః."

అను యాజ్ఞవల్క్య వచనమును బట్టి గృహస్థబ్రహ్మచారు లొనర్చు గాయత్రీమంత్రజపమందు ప్రణవవ్యాహృతులు ముం దుచ్చరింపఁబడు ననియు గాయత్రి కంతమందు ప్రణవోచ్చారణము వానప్రస్థవిషయ మనియు నెఱుంగవలయును.

"గృహస్థో బ్రహ్మచారీచ ప్రణవాద్యా మిమాం జపేత్,
అంతే యః ప్రణవంకుర్యా న్నాసౌ వృద్ధి మవాప్నుయాత్"

గృహస్థు బ్రహ్మచారియు ప్రణవ మాదియందుఁ జేర్చి గాయత్రిని జపింపవలెను. గాయత్రీమంత్రమునకు చివర ప్రణవమును కూర్చువాఁడు వృద్ధినొందఁ డని చంద్రిక యనుగ్రంథమందుఁ జెప్పఁబడియున్నది. కావున ప్రణవవ్యాహృతులు గాయత్రికి ముందుగా నుండవలెను.

"సంపుటైకషడోంకారా గాయత్త్రీ త్రివిధా మతా.
తత్రైకప్రణవా కార్యా గృహస్థై ర్జపకర్మణి."

ఈమూఁడు పక్షములలోను గాయత్త్రి నొక్కప్రణవముతోనే జపింపవలెను.

"గృహస్థవత్తు జప్తవ్యా సదైవ బ్రహ్మచారిభిః"
అన్నట్లు గృహస్థునివలె బ్రహ్మచారియు జపింపవలెను.

గాయత్రీమంత్రజప మెట్లుచేయవలెను?

"పూర్వాం సంధ్యాం జపేత్తిష్ఠ న్సావిత్రీ మార్కదర్శనా
పశ్చిమాం తు సమాసీన స్సమ్యగార్క్ష విభావనాత్." [త్,

ప్రాతః కాలమందు సూర్యబింబదర్శన మగువఱకును నిలువఁబడి గాయత్త్రిని జపింపవలెను. సాయంకాలమందు నక్షత్రములు కనుపడువఱకును కూర్చుండి గాయత్త్రిని జపింపవలెనని మనువు చెప్పియుండుటచే సాయంకాలమం దుత్తరాభిముఖుఁడై కూర్చుండియు, ప్రాతఃకాలమందు ప్రాఙ్ముఖుఁడై నిలుచుండియు జపము చేయవలెను. జపకాలమందు గాయత్త్రి నచ్ఛిన్నపాదముగా జపింపవలెను గాని మధ్యమధ్యను విఱిచిజపింపఁగూడదు.

"యథానిశాంతంగాయత్త్రీముచ్చరన్ జపమాచరేత్,
సంధ్యాసు భిన్నపాదా చే త్స జపో నిష్ఫలో భవేత్."

అని ప్రమాణము.

గాయత్త్రి నెన్నిమార్లు జపింపవలెను?

"దర్భే ష్వాసీనో దర్భాన్ ధారయమాణ స్సోదకేన పాణినా ప్రత్యఙ్ముఖ స్సావిత్రీం సహస్రకృత్వ ఆవర్తయే చ్ఛతకృత్వోఽ పరిమితకృత్వో వా"

అని యాపస్తంబఋషి చెప్పినట్లు వెయ్యిమార్లు గాని నూఱుమార్లు గాని లెక్కలేని మార్లుగాని జపింపవలెను.

"పర్వభిస్తు జపః కార్యో నాఙ్గుళీనాం నిపాతనైః,
నిపాతనైస్తు యజ్జప్తం తత్సర్వం రాక్షసం భవేత్."

జపము చేయునపుడు వ్రేళ్ళగుంపులమీఁద లెక్కపెట్టవలెను గాని వ్రేళ్లుముడిచి లెక్కపెట్టఁగూడదు.

గాయత్త్రీమంత్రార్థము.

పూర్వమందే ఓంకారము, వ్యాహృతులు వ్యాఖ్యాతములైనవి. ప్రత్యగ్బ్రహ్మైక్యమును బోధించుగాయత్త్రీమంత్ర మిపుడు వివరింపఁబడుచున్నది.

మూ॥ తత్సవితు ర్వరేణ్యం భర్గో దేవస్య ధీమహి। ధియో యో నః ప్రచోదయాత్॥

టీ. "త్రిపదా గాయత్త్రీ" అను శ్రుతివలన నీగాయత్త్రి మూఁడుపాదములు గలది.

"త్రిభ్య ఏవతు వేదేభ్యః పాదం పాద మదూదుహాత్"

అను వచనమువలన మూఁడుపాదములు గలది. దీని నాల్గవపాద మేల పఠింపఁబడలేదన్నచో, అధికారము లేకపోవుటచే దీని నాల్గవపాదము పఠింపఁబడదు. ఉపనయన మనఁగా శ్రుతివిహితసంస్కారము, శ్రుతి మూఁడుపాదములు గల గాయత్త్రిగాని నాల్గుపాదములు కలదికాదు. వటుని కెంతమంత్రముచే నుపనయనము చేయఁబడినదో దాని నుచ్చరించుటయందే అధికారముకలదు గాని తదితరమం దధికారము లేదు.

చతుర్థపాద మాథర్వణవేదములోనిది గావున దాని నుచ్చరింపవలె నన్న దానికి వేఱుగా నుపనయనము కావల యును.అది లేనపు డాచతుర్థపాదము నుచ్చరించుటకు పటున కధికారము లేదు. ఉజ్జ్వలకారుఁ డిట్లు చెప్పుచున్నాఁడు.

"ఆథర్వణస్యతు వేదస్య పృథగుపనయనం కర్తవ్యమ్."

దీని ననుసరించిన బ్రాహ్మణము.

"నాన్యత్రసంస్కృతో భృగ్వంగిరసోఽధీయీత."

ఇతరవేదప్రకార ముపనయనము చేసికొన్నవాఁ డీయా థర్వణవేదమును జదువఁగూడదు. అట్లు చదువఁగోరువాఁడు తద్వేదానుసరణముగా నుపనయనము చేసికొనవలయును.ఇందు వలన గాయత్రియొక్క చతుర్థపాదము పఠింపఁబడదు.

1.దీవ్యతి=ఉదయాస్తంగమనాభ్యాం దేశాంతరం యాతీతి దేవః.
ఉదయాస్తమయములచే దేశాంతరమును పొందు వాఁడుగావున దేవుఁడు.

2. దీవ్యతి=ప్రకాశయతీతి వా దేవః.
ప్రకాశించువాఁడు. గావున దేవుఁడు.

3. ద్యులోకవర్తిత్వాద్వా దేవః.
అంతరిక్షలోకమం దుండువాఁడు గావున దేవుఁడు.

దేవస్య=ప్రకాశించువాఁడైన, తత్=ఆ, సవితుః= సూర్యునియొక్క, వరేణ్యమ్=శ్రేష్ఠమైన, భర్గః=తేజస్సును, ధీమహి=ధ్యానముచేసెదము. యః=ఏసూర్యుఁడు, నః=మాయొ క్క,ధియః=బుద్ధులను, ప్రచోదయాత్=ప్రేరణచేయునో, సవితుః=సూతే, సకలజననిర్వృతిహేతుం వృష్టి మితి సవితా,

సర్వజనసౌఖ్యహేతువగు వృష్టి గలిగించువాఁడుగావున సవిత.

వరేణ్యమ్= ఇది నాలుగక్షరములశబ్ద మని యూహింపవలె ననియు, అట్లుచ్చరింపఁగూడ దనియు పెద్దలంద్రు.

భర్గః = భర్జతి తమస్కాండం హంతీతి భర్గః.

అజ్ఞానమును పోఁగొట్టునది గావున భర్గము. ఇది సకారాంతనపుంసకము.

ఏసూర్యుఁడు మాబుద్ధివృత్తులను ప్రకృష్టముగా ప్రేరణ చేయుచున్నాఁడో ఆసూర్యునియొక్క తేజస్సును మేము ధ్యానించెదము.

సాక్షాచ్ఛ్రీమన్నారాయణుఁ డుండఁగా గాయత్రి సూర్యుని ప్రతిపాదించుట యేమి? అన్నచో ఆదిత్యుఁడుగూడ

"య ఏషోఽంతరాదిత్యే హిరణ్మయః పురుషో దృశ్యతే"

"యదాదిత్యగతం తేజో జగ ద్భాసయ తేఽఖిలమ్,
... ... త త్తేజో విద్ధి మామకమ్."

"ధ్యేయ స్సదా సవితృమండలమధ్యవర్తీ నారాయణః" ఇత్యాదిప్రమాణములచే పరబ్రహ్మస్వరూప మని ప్రసిద్ధము గావున నట్లు చెప్పవచ్చును.

"ఉతైనం గోపా అదృశన్నదృశన్ను దహార్యః,
ఉతైనం విశ్వాభూతాని సదృష్టో మృడయాతి నః"

టీక. ఏనమ్ = ఆదిత్యరూపుఁడైన యీభగవంతుని, గోపాః=అజ్ఞులు,అదృశన్ =చూచుచున్నారు.(సూర్యుఁడుదయిం

చినాఁడు, సూరుఁ డస్తమించుచున్నాఁడు, శీఘ్రముగా నీగోవుల నూరిలోనికిఁ దీసికొని పోవలయును) ఆరీతిగా, ఉదహార్యః = నీళ్లు తెచ్చుస్త్రీలు సూర్యుఁ డస్తమించుచున్నాఁడు. వేగముగా జలము తేవలె నని, అదృశన్=చూచుచున్నారు. విశ్వాభూతాని=సకలభూతములు, ఏనమ్ = భగవంతుఁడగు నీసూర్యుని, అదృశన్=చూచుచున్నారు.

దృష్టః=చూడఁబడిన ఆభగవంతుఁడు, నః = మమ్ముల లను, మృడయాతి=సుఖపెట్టును. కాని యివి యన్నియు నజ్ఞానావృతము లగుటచే నీతఁడే పరతత్త్వమని యెఱుంగరు. సూర్యరూపి యగునట్టి భగవంతుఁడు జ్ఞానదీపముచేఁ జూడఁ బడినవాఁడై మమ్ములను సుఖింపఁజేయునుగాక. సచ్చిదానందస్వరూపదర్శన మెట్లు మాకు లభించునో అట్లు మమ్ముల ననుగ్రహించునుగాక. ఈశ్రుతినిబట్టి యాలోచింపఁగా ఆదిత్యుఁడే పరబ్రహ్మస్వరూప మని నిశ్చయింపఁబడుచున్నది. ఇంతియకాక గాయత్రీమంత్రమే భగవత్పర మని సమర్థింపఁ బడుచున్నది. ఎట్లన; యః = ఏ దేవుఁడు, నః = మాయొక్క, ధియః=బుద్ధులను, ప్రచోదయాత్ = ప్రేరణచేయునో, అట్టి, సవితుః దేవస్య = సూర్యమండలాంతర్వర్తియగు భగవంతుని యొక్క, వరేణ్యమ్ = శ్రేష్ఠమయిన, భర్గః = తేజస్సును, ధీమహి = ధ్యానించెదము.

ఈగాయత్రీమంత్రార్థము విద్యారణ్యస్వామిచే శ్లోకరూపముగా నిట్లు వివరింపఁబడినది.

"తదిత్యవాఙ్మనోగమ్యం ధ్యేయం సవితృమండలే,
సవితు స్సకలోత్పత్తిస్థితిసంహారకారిణః,

వరేణ్యమాశ్రయణీయం యదాధారమిదం జగత్,
భర్గ స్స్వసాక్షాత్కారేణావిద్యాతత్కార్యదాహకమ్,
దేవస్య ద్యోతమానస్య హ్యానందాత్క్రీడతోఽపి వా,
ధీమహ్యాహం స ఏవేతి తేనైవాభేదసిద్ధయే,
ధియోఽన్తఃకరణవృత్తీశ్చ ప్రత్యక్ప్రవణచారిణీః,
య ఇత్యలింగధర్మం యత్సత్యజ్ఞానాదిలక్షణమ్,
నోఽస్మాకం బహుధాఽభ్యస్తభిన్నభేదదృశాంతథా,
ప్రచోదయాత్ప్రేరయతు ప్రార్థనేయం విచార్యతే."

లోకోపకార మనుగ్రంథమందు గాయత్రీమంత్రజప మీరీతిగా నాచరింపవలయు నని నిర్ణయింపఁబడినది.

"తథామధ్యాహ్నసంధ్యాయా మాసీనః ప్రాఙ్ముఖోఽజ
తిష్ఠన్నపి జపే ద్దేవీ మాదిత్యాభిముఖో ద్విజః, [పేత్,
కృత్వోత్తానౌ కరౌ ప్రాత స్సాయంచాధోముఖౌకరౌ,
మధ్యే ప్రసారితకరౌ జప ఏవ ముదాహృతః."

మధ్యాహ్నసమయమున తూర్పువైపు తిరిగి కూర్చుండి కాని సూర్యాభిముఖుఁడై నిలువఁబడి కాని గాయత్రీ మంత్రజపము చేయవలెను. సాయంకాలమందుఁ జేతుల నధోముఖముగాఁ జేసియు, ప్రాతఃకాలమందు వెలికిల పాటుగా నుంచియు మధ్యాహ్నకాలమందు చాఁచియును గాయత్రీమంత్రజపము చేయవలయును.

"ప్రాత ర్నాభిసమౌ హస్తౌ మధ్యే హృదయసమ్మితౌ,
సాయం ముఖసమౌ కృత్వా జపే త్కాలత్రయం సుధీః"

ప్రాతఃకాలమందు హస్తములను నాభిసమముగాను, మధ్యాహ్నము గుండెలదగ్గఱగను, సాయంకాలము ముఖసమముగాను ఉంచి గాయత్రిని జపింపవలెను.

గాయత్రీమంత్రజపమునకు సంకల్పము.

శ్రౌతాచమనము చేసి ప్రాణాయామ మొనరించి "ప్రాతస్సంధ్యాంగంయథాశక్తిగాయత్రీ మంత్రజపంకరిష్యే"

కరన్యాసము.

"తత్సవితు రంగుష్ఠాభ్యాం నమః"
"వరేణ్యం తర్జనీభ్యాం నమః"
"భర్గో దేవస్య మధ్యమాభ్యాం నమః"
"ధీమహి అనామికాభ్యాం నమః"
"ధియో యో నః కనిష్ఠికాభ్యాం నమః"
"ప్రచోదయాత్ కరతలకరపృష్ఠాభ్యాం నమః"

హృదయన్యాసము.

"తత్సవితు ర్బ్రహ్మాత్మనే హృదయాయ నమః"
"వరేణ్యం విష్ణ్వాత్మనే శిరసే స్వాహా"
"భర్గో దేవస్య రుద్రాత్మనే శిఖాయై వషట్"
"ధీమహి సత్యాత్మనే శ్రోత్రాయ కవచాయహుమ్"
"ధియో యో నః జ్ఞానాత్మనే నేత్రాభ్యాం వషట్"
"ప్రచోదయా త్సర్వాత్మనేఽస్త్రాయ ఫట్"
"భూర్భువస్సువరోమితి దిగ్బంధః"

ధ్యానము.

"శ్లో. ముక్తావిద్రుమహేమనీలధవళచ్ఛాయైర్ముఖైస్త్రీక్షణై ర్యుక్తా మిందునిబద్ధరత్నముకుటాం తత్త్వార్థవర్ణాత్మికామ్,

గాయత్రీంవరదాభయాంకుశకశాం శుభ్రంకపాలంగదామ్,
శంఖం చక్ర మథారవిందయుగళం హస్తైర్వహంతీంభజే"

టీ. ముక్తా = ముత్యములు, విద్రుమ = పగడములు, హేమ = బంగారము, నీల = ఇంద్రనీలములు, ధవళ=వజ్రములు వీనివంటి, ఛాయైః = కాంతులుగలవియై, త్రీక్షణైః= మూఁడుకన్నులుగల, ముఖైః = ముఖములతో, యుక్తామ్= కూడుకొన్నదియు, ఇందు = చంద్రునితో, నిబద్ధ=కట్టఁబడిన, రత్నముకుటామ్=రత్నకిరీటముగలిగినదియు, తత్త్వార్థ వర్ణాత్మికామ్ = పరతత్త్వమును బోధించు నక్షరములు గలదియు, వరద, అభయ, అంకుశ, కశ, అను ముద్రలుగలదియు, శుభ్రమ్=స్వచ్ఛమైన, కపాలమ్=పునుకను,గదామ్ = గదను, శంఖమ్ = శంఖమును, చక్రమ్ = చక్రమును, అరవింద యుగళమ్=రెండుపద్మములను, హస్తైః=కరములచే, వహంతీమ్=ధరించుచున్నదియునుఅగు, గాయత్రీమ్ = గాయత్రిని, భజే=సేవించుచున్నాను.

ముద్రలు.

"సుముఖం సంపుటం చైవ వితతం విస్తృతం తథా,
ద్విముఖం త్రిముఖం చైవ చతుఃపంచముఖం తథా,
షణ్ముఖోఽధోముఖం చైవ వ్యాపకాంజలికం తథా,
శకటం యమపాశంచ గ్రథితం సుముఖోన్ముఖమ్,
ప్రబలం ముష్టికం చైవ మత్స్యకూర్మవరాహకమ్,
సింహాక్రాంతం మహాక్రాంతం ముద్గరం పల్లవం తథా,
చతుర్వింశతిముద్రా వై గాయత్ర్యాం సుప్రతిష్ఠితాః,
ఇతి ముద్రా న జానాతి గాయత్రీ నిష్ఫలాభవేత్ "

"ఓం తత్సవితు ర్వరేణ్యం భర్గో దేవస్య
ధీమహి ధియో యో నః ప్రచోదయాత్"

ఉత్తరముద్రలు.

"సురభిర్ జ్ఞానచక్రే చ యోనిః కూర్మోఽథ పంకజమ్,
లింగనిర్యాణముద్రా చేత్యష్టముద్రాః ప్రకీర్తితాః."

సూర్యోపస్థానము.

ప్రాతఃకాలమందు "మిత్రస్య" అను మంత్రమును, మధ్యాహ్నసమయమందు "ఆసత్యేన రజసా" అను మంత్రమును, సాయంకాలమందు "ఇమం మే వరుణ" అనుమంత్రమును సూర్యోపస్థానమంత్రములుగాఁ బఠింపవలెను.

"ప్రాణాయామై స్త్రిభిఃపూతో గాయత్రీజప మాచరేత్,
అథోపతిష్ఠే దాదిత్య ముదయంతం సమాహితః."

ముమ్మాఱు ప్రాణాయామముచేసి గాయత్రీమంత్రజపము చేయవలెను. తరువాతను ఉదయించుచున్న సూర్యదేవునుపస్థానము [స్తోత్రము] చేయవలయు నని వసిష్ఠుఁడును;

"జపం కృత్వా విధానేన సంధ్యోపాసనమాచరేత్,
ఉపస్థానం స్వకై ర్మంత్రై రాదిత్యస్య తు కారయేత్"

అని చంద్రికాకారుఁడును చెప్పియున్నారు. విధ్యుక్తముగా గాయత్రీమంత్రజపము గావించి స్వశాఖాపఠితములగుమంత్రములచే సూర్యోపస్థానము చేయవలెను.

"అథోపతిష్ఠే దాదిత్య ముదయంతం సమాహితః,
మైత్రీభి ర్వారుణేనా స్తంగతం సూక్తేన బహ్వృచః."

ఉదయించుచున్న సూర్యుని సౌరఋక్కులచేతను, అస్తమించుసూర్యుని వారుణఋక్కులచేతను ఉపస్థానము

చేయవలె నని ఆశ్వలాయనస్మృతియందు చెప్పఁబడిన విభాగ మాశ్వలాయన శాఖీయులకే కాని యితరులకుఁ గాదు. ఆలోచింపఁగా నీయంశము గృహ్యసూత్రమందుఁ జెప్పక పోయినను స్వప్రణీతస్మృతియం దాశ్వలాయనుఁడు తానే స్వయముగాఁ జెప్పియున్నాఁడు. కావున నవశ్యముగా నిట్లు చేయవలెను. గృహ్యసూత్రమునకు మూలమగు నుత్సన్న శాఖ లేకపోవుటచే గృహ్యమం దీయంశము చెప్పఁబడియుండ లేదు. గృహ్యమున కుత్సన్నశాఖ మూల మని ఆపస్తంబుఁడు చెప్పుచున్నాఁడు.

"తేషా ముత్సన్నాః పాఠాః ప్రయోగాదనుమీయన్తే."

[ఉత్సన్నములగు పాఠములు ప్రయోగముచే నూహింపఁబడుచున్నవి.] దీని నెఱింగియుండియు నాశ్వలాయనుఁ డెట్లు తనస్మృతియందు దీనిని విధించె నన్నచో ననుమేయింపఁబడు వేదము మూలముగాఁగల స్మృతులయం దుపస్థానము చెప్పఁబడియుండుటచే నాశ్వలాయనుఁ డట్లు వ్రాసెను గావున దోషము లేదు. ఆశ్వలాయనుఁడు వ్రాసినస్మృతి యిది:—

"ప్రాత శ్చతసృభి ర్మిత్రస్య చర్షణీధృత ఇత్యాభి రాదిత్య ముపతిష్ఠేత, వారుణేన యచ్చిద్ధితే విశోయథేతి పంచర్చేన సాయమ్"

"మిత్రస్యచర్షణీధృత" అనునవి నాలుగుసోరబుక్కులు, వీనిచే ప్రాతఃకాలమందు సూర్యోపస్థానము చేయవలెను. "యచ్చిద్ధితే విశోయథా" అను అయిదును వారుణ బుక్కులు. వీనిచే సాయంకాలమందు సూర్యోపస్థానము

చేయవలెను. లేదా రెండుకాలములయందును "జాతవేదసః" అను మంత్రమునే ఆశ్వలాయనశాఖీయు లుపస్థానమంత్రము గాఁ జెప్పవచ్చు నని చెప్పఁబడిన దన్నచో విచారింపఁగా నీపక్ష మంతసమంజసముగా నున్నట్లు కానరాదు. ఈపక్షము పూర్వోక్తాశ్వలాయనస్మృతితో విరోధించుటచే నాశ్వలాయనుని కనభిమత మగుటవలనను ఆశ్వలాయనప్రోక్తగృహ్యాచారములతో విరోధించుటవలనను ఉపేక్షింపఁదగినది.

సూర్యోపస్థాన మంత్రార్థము.

మూ॥ మిత్రస్య చర్షణీధృతశ్శ్రవో దేవస్య సానసిమ్। సత్యం చిత్రశ్రవస్తమమ్। మిత్రో జనాన్యాతయతి। ప్రజానన్మిత్రో దాధార। పృథివీ ముత ద్యామ్। మిత్రః కృష్టీ రనిమిషాభిచష్టే। సత్యాయహవ్యం ఘృతవద్విధేమ। ప్రస మిత్రమర్తో అస్తు ప్రయస్వాన్యస్త ఆదిత్యశిక్షతి వ్రతేన। న హన్యతే న జీయతే త్వోతో నైనమగ్ంహో అశ్నో త్యంతితో న దూరాత్॥

టీ. చర్షణీధృతః=ప్రజాధారకుఁడైనట్టి, (చర్షణీ=కృషే రాదేశ్చచః అను ఔణాదికసూత్రముచే అనిప్రత్యయము. ఆదియందు చకారము రాఁగా "చర్షణీ" అని అయినది) దేవస్య మిత్రస్య=దివాభిమానిదేవత యగుసూర్యునియొక్క, సానసిం=బాగుగసేవింపఁదగినదియు, (సత్యమ్ = నాశములేనిదియు, చిత్రశ్రవస్తమమ్ = వినువారి మనస్సులను సుఖపెట్టునదియు, అగు,శ్రవః=కీర్తిని, స్తౌమి=[అధ్యాహార్యము] స్తుతించుచున్నాను.

మిత్రోజనానితి.

(అయం) మిత్రః = ఈసూర్యుఁడు, ప్రజానన్=(వారి వారిఅధికారములను) తెలిసికొనుచున్నవాఁడై, జనాన్ = జనులను, యాతయతి=(వారి వారి కర్మములయందు) నియోగించుచున్నాఁడు, మిత్రః = సూర్యుఁడు, పృథివీమ్ = భూమిని, ద్యాముత = అంతరిక్షమును, దాధార = ధరించెను, మిత్రః = సూర్యుఁడు, కృష్టీః = మనుష్యులను, అనిమిషా = దేవతలను, అభిచష్టే = అంతటను చూచుచున్నాఁడు, సత్యాయ = అమోఘ ఫలముగల ఆసూర్యునికొఱకు, ఘృతవత్ = ఘృతముతోఁ గూడిన, హవ్యమ్ = చరువును, విధేమ = చేయుచున్నాము.

ప్రసమిత్ర మర్తో ఇతి,

హేమిత్ర = ఓయిసూర్యుఁడా!, యః = ఏయజమానుఁడు, తే వ్రతేన = నీసంబంధమైన కర్మముచేత, శిక్షతి = సమర్థుఁడగుటను కోరుచున్నాఁడో, స మర్తః=ఆమర్త్యుఁడు, ప్రయస్వాన్ =వ్రతఫలముకలవాఁడు, అస్తు=అవుఁగాక. లేక ప్రయశ్శబ్ద మన్నవాచి కనుకను, అన్నముకలవాఁడగుఁ గాక.

త్వోతః = (త్వయా ఊతః) నీచేరక్షితుఁడైనవాఁడు, నహన్యతే = (కొట్టఁబడఁడు) రోగాదులచేఁ బీడింపఁబడఁడు, నజీయతే = (శత్రువులచే( జయింపఁబడఁడు, త్వోతః = త్వయాఊతః (నీచే రక్షింపఁబడిన )ఏనం = ఈయజమానుని, అంహః = పాపము, అంతితః = దగ్గఱను, నాశ్నోతి = పొందలేదు.

ఇట్లు సూర్యోపస్థానము చేసినతరువాత "కుర్వీత దిశో నమస్కార్యా ద్దిగీశాంశ్చ పృథక్పృథక్" అను ప్రమాణమునుబట్టి ప్రాచ్యాదిదిక్కులకును తద్దిగధిదేతవలకు, ఇంద్రాదిదేవతలకును వందన మాచరింపవలెను.

"దిగ్దేవతానమస్కార మంత్రోఽయం సంధ్యయో ర్భవేత్"

అనునట్లు "నమః ప్రాచ్యై దిశే" అనునది దిగ్దేవతా నమస్కారమంత్రము.

మూ॥ ఓం నమః ప్రాచ్యై దిశే యాశ్చ దేవతా ఏతస్యాం ప్రతివసం త్యేతాభ్యశ్చ నమోనమో దక్షిణాయైదిశే యాశ్చ దేవతా ఏతస్యాం ప్రతివసం త్యేతాభ్యశ్చ నమో నమః। ప్రతీచ్యై దిశే యాశ్చ దేవతా ఏతస్యాం ప్రతివసం త్యేతాభ్యశ్చ నమోనమ ఉదీచ్యై దిశే యాశ్చ దేవతా ఏతస్యాం ప్రతివసం త్యేతాభ్యశ్చ నమో నమ ఊర్ధ్వాయై దిశే యాశ్చ దేవతా ఏతస్యాం ప్రతివసంతి। ఏతాభ్యశ్చనమో నమోఽధరాయైదిశే యాశ్చ దేవతాఏతస్యాం ప్రతివసం త్యేతాభ్యశ్చ నమో నమోఽ వాంతరాయై దిశే యాశ్చ దేవతా ఏతస్యాం ప్రతివసం త్యేతాభ్యశ్చ నమో నమో గంగాయమునయో ర్మధ్యే యే వసంతి తే మే ప్రసన్నాత్మాన శ్చిరం జీవితం వర్ధయంతి నమో గంగాయమునయో ర్మునిభ్యశ్చ। నమో నమో గంగాయమునయోర్మునిభ్యశ్చనమః, సంధ్యాయై నమః సావిత్ర్యై నమః గాయత్ర్యై నమః సరస్వత్యై నమః సర్వాభ్యో

దేవతాభ్యోనమః। దేవేభ్యోనమః। ఋషిభ్యోనమః। మునిభ్యో నమః। గురుభ్యోనమః। పితృభ్యోనమః॥

టీక. తూర్పు, దక్షిణము, పడమర, ఉత్తరము, మీఁదు, క్రింది, అవాంతరదిక్కులు వీనికిని దిక్కులయొక్క అధిష్ఠానదేవతలకును నమస్కారము, గంగాయమునలమధ్య నుండువారికి నమస్కారము, వారు నిర్మలమైన మనస్సుగల వారై నాచిరజీవనమును పెంచుదురుగాక, గంగాయమునల మధ్యనుండు మునులకు నమస్సు, సంధ్యాదేవికి, సావిత్రికి, గాయత్రికి, సరస్వతికి, సకలదేవతలకును, ఋషులకు, మును లకు, గురువులకు, పితృదేవతలకు, నమస్కారము.

మూ॥ కామోఽకార్షీన్మన్యురకార్షీన్నమోనమః॥

టీక. "నాహం కరోమి, కామః,కర్తా నాహం కర్తా" అను శ్రుతివలన, "కుర్వన్నపి న లిప్యతే" అనుస్మృతివలనను, కామః = కామాభిమానిని యగుదేవత, అకార్షీత్ = చేసె, ను, మన్యుః = క్రోధాభిమానిని యగు దేవత, అకార్షీత్ = చేసెను, అట్టికామమునకొఱకు, క్రోధమునకొఱకు, నమస్కా రము.

మూ॥ పృథివ్యాపస్తేజో వాయురాకాశాత్॥

టీక. భూమి, జలము, తేజస్సు, వాయువు, ఆకాశము, అనునీ పంచభూతములకును నమస్కారము.

మూ॥ ఓం నమో భగవతే వాసుదేవాయ॥

టీక. ఓంకారవాచ్యుఁడు షడ్గుణైశ్వర్యసంపన్నుఁడు గు వాసుదేవునికొఱకు నమస్కారము.

సంధ్యారూపపరదేవతను ప్రార్థించుచున్నాఁడు.

మూ॥ యాఀగ్ సదా సర్వభూతాని చరాణి స్థావరాణిచ,
సాయంప్రాతర్నమస్యంతి సా మా సంధ్యా అభిరక్షతు.
శివాయ విష్ణురూపాయ శివరూపాయ విష్ణవే,
శివస్య హృదయం విష్ణు ర్విష్ణోశ్చ హృదయం శివః.
యథా శివమయో విష్ణు రేవం విష్ణుమయ శ్శివః,
యథాంతరం న పశ్యామి తథా మే స్వస్తి రాయుషి.
నమో బ్రహ్మణ్యదేవాయ గోబ్రాహ్మణహితాయ చ,
జగద్ధితాయ కృష్ణాయ గోవిందాయ నమో నమః.

టీక. చరాణి స్థావరాణి సర్వభూతాని = స్థిరచరరూపములగు సర్వభూతములు, యామ్ = ఏసంధ్యను, సాయంప్రాతః = సాయంప్రాతఃకాలములయందు, నమస్యంతి = నమస్కరించుచున్నవో, సా సంధ్యా = ఆసంధ్య, మా = నన్ను, అభిరక్షతు = రక్షించును గాక.

"యాఀగ్ సదా" అనుమంత్రమందు "సాయంప్రాతః" అనిచెప్పుటచే ప్రాతస్సాయంసంధ్యలు రెండేగాని మూఁడవదియగు మాధ్యాహ్నికసంధ్య లేనట్లు స్పష్టమగుచున్నది. అందువలననే ఆపస్తంబుఁడు "సంధ్యయో ర్బహిర్గ్రామా దాసనమ్" అని ద్వివచనముగాఁ జెప్పియున్నాఁడు. మాధ్యాహ్నికసంధ్య స్మృతివిహితము గాని గృహ్యసూత్రకారులు చెప్పలేదు. ఒకప్పుడు మాధ్యాహ్నికసంధ్య వార్చక భోజనము చేసినను ప్రత్యవాయము లేదని ధర్మజ్ఞులు చెప్పుచున్నారు. అయినను స్మృతికర్తలచేతను విధింపఁబడినది గావున మాధ్యాహ్నిక సంధ్యను విడువఁగూడదు.

"శివాయ" అనునది మొదలుకొని "ఉత్తమే శిఖరే" అనుదానివఱకును పురాణశ్లోకములు. వీనియర్థము స్పష్టముగా నున్నది గావున వ్రాయలేదు.

మూ॥ ఉత్తమే శిఖరే జాతే భూమ్యాం పర్వతమూర్ధని,
బ్రాహ్మణేభ్యోఽభ్యనుజ్ఞాతా గచ్ఛ దేవి యథాసుఖమ్॥

ఇది గాయత్రీమంత్రజప మైనతరువాతను గాయత్రీదేవతను స్వస్థానమునకుఁ బంపివేయుమంత్రము.

"దేవీప్రస్థాపనాంతం స్యా త్సంధ్యాకర్మ మునీరితమ్" అనుప్రమాణమునుబట్టి సంధ్యావందనకర్మము దేవీప్రస్థాపనమంత్ర మగు "ఉత్తమేశిఖరే" అనుదానితో పరిసమాప్తమగునని సిద్ధాంతము.

టీ. భూమ్యాం = భూమియందున్న, పర్వతమూర్ధని = మేరు పర్వతముయొక్క ఉపరిభాగమందు, జాతే = ఉన్నదానా!, ఉత్తమే = శ్రేష్ఠమైన, శిఖరే = పర్వతశృంగమువలె నున్నతమగు మందిరమందు నివసించుటకు, బ్రాహ్మణేభ్యః= నిరంతరోపాసకు లగుబ్రాహ్మణోత్తములవలన, అభ్యనుజ్ఞాతా సతీ = అనుజ్ఞ నియ్యఁబడినదానవై, దేవి = భగవతీ!, యథాసుఖమ్ = సుఖమగునట్లు, గచ్ఛ = వెళ్లుము.

మూ॥ స్తుతా మయా వరదా వేదమాతా
ప్రచోదయంతీ పవనే ద్విజాతా,
ఆయుః పృథివ్యాం ద్రవిణం బ్రహ్మవర్చసం
మహ్యం దత్వా ప్రయాతు బ్రహ్మలోకమ్॥

టీక. వరదా = వరముల నిచ్చుదానవును; వేదమాతా = వేదములకు తల్లివిని, పవనే = పవిత్రకర్మమందు, ప్రచోదయంతీ = ప్రవర్తింపఁ జేయుచానవును, ద్విజాతా = రెండుసార్లు పుట్టినదానవును, అగునీవు, మయా = నాచేత, స్తుతా = స్తుతింపఁ బడినదానవై, పృథివ్యామ్ = భూమియందు, మహ్యమ్ = నాకొఱకు, ఆయుః = ఆయుష్యమును, ద్రవిణమ్ = ధనమును, బ్రహ్మవర్చసమ్ = బ్రహ్మవర్చస్సును, దత్త్వా = ఇచ్చి, బ్రహ్మలోకమ్ = బ్రహ్మలోకమునుగూర్చి, ప్రయాతు = పోదువుగాక.

మూ॥ నమో స్త్వనంతాయ సహస్రమూర్తయే
సహస్రపాదాక్షి శిరోరుబాహవే,
సహస్రనామ్నే పురుషాయ శాశ్వతే
సహస్రకోటీ యుగధారిణే నమః॥

టీ. సహస్ర = వేలకొలఁది, మూర్తయే = శరీరములుగలవాఁడును, సహస్రపాదాక్షిశిరోరుబాహవే = వేలకొలఁది పాదములు, నేత్రములు, శిరస్సులు, తొడలు, బాహువులు గలవాఁడును, సహస్రనామ్నే = సహస్రనామములు గలవాఁడును, శాశ్వతే పురుషాయ = శాశ్వతపురుషుఁడును, సహస్రకోటీ యుగధారిణే = పెక్కు వేలకోట్లయుగములను ధరించినవాఁడును, అగు, అనంతాయ = అనంతునికొఱకు, నమోఽస్తు = నమస్కార మవుఁగాక.

మూ॥ ఇదం ద్యావాపృథివీ సత్యమస్తు
పితర్మాత ర్యదిహోపబ్రువే వామ్।

భూతం దేవానా మవమే అవోభి
ర్విద్యామేషం వృజినం జీరదానమ్॥

టీ. స్వరక్షణకొఱకు స్వర్భూలోకములను స్తుతించు చున్నాఁడు—పితర్మాతః ద్యావాపృథివీ=తండ్రియైన ఓస్వర్గమా! తల్లియైన ఓపృథివీ, ఇహ=ఈకర్మమందు,వామ్=మీయుభయులనుగూర్చి, యదుపబ్రువే = ఏవాక్యమును పలుకుచున్నానో, ఇదమ్ = ఈవాక్యము, సత్యమస్తు=సత్యమగునుగాక, అవోభిః=అస్మద్రక్షణములతోఁ గూడ, దేవానామ్ = దేవతలయొక్క, [ఇది సర్వభూతముల కుపలక్షణము] సర్వభూతములయొక్క, అవమే = రక్షించువారు మీరిద్దఱు, భూతమ్=భవతమ్ = కండి, "మీరిద్దఱును మాయొక్కయు సర్వభూతములయొక్కయు సంరక్షకులు కండి" అని నేను పలికినమాట సత్యమగుఁగాక యని తాత్పర్యము. మీకృపవలన మేము, జీరదానమ్ = జీవనము నిచ్చునదియు, వృజినమ్=తాపవర్జితమునుఅగు, ఇషమ్=అన్నమును, విద్యామ = పొందుదుముగాక.

మూ॥ ఆకాశా త్పతితం తోయం యథా గచ్ఛతి సాగరమ్,
సర్వదేవనమస్కారః కేశవం ప్రతిగచ్ఛతి.

టీ. ఆకాశాత్ =ఆకాశమునుండి. పతితమ్=పడిన, తోయమ్=జలము, యథా సాగరం గచ్ఛతి=ఎట్లు సముద్రమును పొందుచున్నదో, అట్లు, సర్వదేవ నమస్కారః = సకలదేవతలకుఁ జేసిననమస్కారము, కేశవంప్రతి = శ్రీమహావిష్ణువును గూర్చి, గచ్ఛతి=వెళ్లుచున్నది.

మూ॥ సర్వవేదేషు యత్పుణ్యం సర్వతీర్థేషు యత్ఫలమ్,
తత్ఫలం పురుష ఆప్నోతి స్తుత్వా దేవం జనార్దనమ్.

టీక. సర్వవేదేషు=సర్వవేద పారాయణములందు, యత్పుణ్యమ్=ఏపుణ్యము గలదో, సర్వతీర్థేషు = సర్వతీర్థములయందును, యత్ఫలమ్=ఏఫలము గలదో, తత్ఫలమ్=ఆ ఫలమును, దేవం జనార్దనమ్ = దేవుఁడైన జనార్దనుని, స్తుత్వా= స్తుతించి, పురుషః=పురుషుఁడు, ఆప్నోతి = పొందుచున్నాఁడు.

మూ॥ వాసనా ద్వాసుదేవస్య వాసితం తే జగత్త్రయమ్।
సర్వభూతనివాసోఽసి వాసుదేవ నమోఽస్తు తే॥

టీక. వాసుదేవస్య= వాసుదేవుఁడవైన, తే=నీయొక్క, వాసనాత్ =నివాసమువలన, జగత్త్రయమ్=మూఁడులోకములు, వాసితమ్=స్థితిని జెందియున్నవి. సర్వభూతనివాసోఽసి=సర్వభూతములకును నివాసభూతుఁడవై యున్నావు. శ్రీవాసుదేవ = ఓ శ్రీవాసుదేవుఁడా, తే = నీకు, నమోఽస్తు = నమస్కారమగును గాక.

సంధ్యాసాద్గుణ్యార్థమై సకలమైన దేశములయందును ఉండుగో బ్రాహ్మణులకు శుభమును ప్రార్థించుచు ప్రవరాన్వితస్వనామకీర్తనపురస్సరముగా పరదేవతకు నమస్కరించుచున్నాఁడు.

మూ॥ చతుస్సాగరపర్యంతం గోబ్రాహ్మణేభ్య శ్శుభం భవతు ... ప్రవరాన్విత ... గోత్రః ... సూత్రః ... శాఖాధ్యాయీ శర్మా అహంభో అభివాదయే॥

టీక. వాక్యార్థము స్పష్టము. ఇచటఁగొందఱు నాలుగుసముద్రము లనుటవలన సప్తసముద్రములను గ్రహింపవలె నని యు సప్తసాగరమధ్యమం దుండుగో బ్రాహ్మణులకు శుభము కలుగునుగాక యని వాక్యార్థ మనియు చెప్పుచున్నారు. మఱి కొంద ఱిచటిశుభశబ్దమునకు హిత మర్థ మనియు ఓభగవతి, వాగ్దేవీ, సంధ్యాదేవి నీకు నమస్కరించుచున్నా నని చెప్పుచున్నారు. వారు పూర్వోక్తమైన అంశమును మఱచిపోయినవారు. 'ఉత్తమే శిఖరే దేవీ' అనుమంత్రముచే తనే సంధ్యాదేవి పంపివేయఁబడినది. ఈమంత్రముతోనే సంధ్యాకర్మము పరిసమాప్త మని,

"దేవీప్రస్థాపనాంతం స్యాత్సంధ్యాకర్మ మునీరితమ్"

అనుస్మృతిచేఁ జెప్పఁబడి యుండఁగా వీరియభివాదనమున కెక్కడ వినియోగము ? వారు స్మృతివచనము లెఱుంగరు.

"ఆత్మపాదౌ నమస్కృత్య గోత్రప్రవరపూర్వకమ్"

అనియు,

"ఆత్మపాదౌ తథా భూమిం స్పృష్ట్వా"

అనియు స్మృతులయందుఁ జెప్పఁబడియున్నది. ఇచట 'అత్మపాదౌ నమస్కృత్య' అనుదానికి "తనపాదములను స్పృశించి" అని అర్థము.

"నక్షత్రంచ తథా సూర్యం ద్విజానప్యభివాదయేత్,
కనిష్ఠానపి వేదజ్ఞా న్సంధ్యాకాలేఽభివాదయేత్,
వినా పుత్రంచ శిష్యంచ దౌహిత్రం దుహితుఃపతిమ్."

నక్షత్రములను, సూర్యుని, బ్రాహ్మణులను వయస్సుచేఁ దనకంటెఁ జిన్నవారైనను వేదము చదువుకొన్నవారిని సంధ్యావందన కాలమందు నమస్కరింపవలెను. పుత్త్రుఁడు, శిష్యుఁడు, దౌహిత్రుఁడు మొదలగువారికి నమస్కరింపఁగూడదు. అని స్మృతికారులు చెప్పుచున్నారు, గాని సంధ్యాంతమందు సంధ్యాదేవతానమస్కారమును చెప్పలేదు.

ఇట్లు ప్రాతస్సంధ్యావందనము పూర్ణముగా ముగిసెను.

---

## మాధ్యాహ్నికసంధ్యావందనము.

---

జలప్రాశనమంత్రము, సూర్యోపస్థానమంత్రము తప్ప తక్కినభాగ మంతయును ప్రాతస్సంధ్యావందనమునకును మాధ్యాహ్నికసంధ్యావందనమునకును సమానమే.

### జలప్రాశనమంత్రము.

మూ॥ ఆపఃపునంతుపృథివీం, పృథివీపూతాపునాతుమామ్, పునంతు బ్రహ్మణస్పతి। ర్బ్రహ్మ పూతా పునాతు మామ్।యదుచ్ఛిష్టమభోజ్యం । యద్వా దుశ్చరితం మమ।సర్వం పునంతు మామాపోఽసతాం చ ప్రతి గ్రహగ్‍స్వాహా.

టీ. ఆపః=ఉదకములు,పృథివీమ్=భూమిని, పునంతు=పవిత్రముగాఁ జేయును గాక. పృథివీ = భూమి,పూతా= జలముచే

శుద్ధమై, మామ్=నన్ను, పునాతు = పవిత్రునిగాఁ జేయును గాక. బ్రహ్మణస్పతిః = సకలవేదప్రతిపాద్యుఁ డగుపరమేశ్వరుఁడు, పునంతు = నన్ను పవిత్రునిగాఁ జేయునుగాక. (పునంతు అనుదానిలో బహువచనము ఛాందసము) పూతా=స్వయముగా పవిత్రమైన, బ్రహ్మ = వేదస్వరూపమగుత త్త్వము, మామ్ = అధ్యేతనైననన్ను, పునాతు=పవిత్రునిగాఁ జేయును గాక. తనచేఁ జేయఁబడిన పాపములను నివర్తింపఁజేయు మని ఉదకములను ప్రార్థించుచున్నాఁడు. యదుచ్ఛిష్టమ్ = ఒకరు తినఁగా మిగిలినదియు, అభోజ్యమ్ = వెంట్రుకలు పడుటచే తను పురుగులు ప్రాఁకుటచేతను తినఁగూడనిదియు, యత్ = ఏదికలదో; మమ=నాసంబంధమైన, యద్దుశ్చరితమ్=అగమ్యాగమనాదిరూపమైన యేపాపము కలదో, సర్వమ్ = దీనినంతను, అసతామ్=అయోగ్యుల సంబంధమైన, ప్రతిగ్రహంచ = దానము పుచ్చుకొనుటయనెడి దుష్కృతమును పరిహరించి, ఆపః = ఉదకములు, మామ్=నన్ను, పునంతు=పవిత్రునిగాఁ జేయునుగాక. స్వాహా = దుష్టప్రతిగ్రహము స్వీకరించినతరువాతఁ బ్రాయశ్చిత్తముకావలసియున్నది, గావున నిట్లభిమంత్రించిన జలము నాముఖాగ్నియందు బాగుగ హుతమగుఁగాక

## అర్ఘ్యప్రదానమంత్రము.

మూ. హఁసశ్శుచిషద్ వసురంతరిక్షసద్ధోతా వేదిష దతిథిర్దురోణసత్ నృషద్వరస దృతసద్వ్యోమస దబ్జా గోజా ఋతజా అద్రిజా ఋతం బృహత్.

టీ. "హన హింసాగత్యోః" అనుధాతువువలన నుత్పన్న మయిన హంసశబ్దము సర్వవ్యాపకుఁ డగుపరమాత్మను బోధించును. అట్టిపరమాత్మ, శుచిషత్ = [పరిశుద్ధప్రదేశములయం దుండువాఁడు] పుణ్యక్షేత్రములయం దుండువాఁడు, వసుః = జగములన్నియు తనయందు నివసించుఁ గావునవసువు. అంతరిక్షసత్ = అంతరిక్షమం దుండువాఁడు, హోతా = అగ్నిరూపముగా దేవతలను పిలుచువాఁడు, వేదిషత్ = యజ్ఞవేదియం దుండువాఁడు, అతిథిర్దురోణసత్ = అతిథిసదృశుఁడై గృహములయం దుండువాఁడు, [ఇచట దురోణశబ్దమునకు స్థానమర్థము] నృషత్ = "అహం వైశ్వానరో భూత్వా ప్రాణినాం దేహమాశ్రితః" అను భగవద్గీతా వచనమును బట్టి మనుష్యులయం దుండువాఁడు, వరసత్ = శ్రేష్ఠమగు తీర్థాదులయం దుండువాఁడు, "శుచిషత్" అనుపదముచేతనే యీయర్థము సిద్ధించుచుండఁగా మరలఁ జెప్పుట పునరుక్తి కాదా? అన్నచో ఆదరముచే నిట్లు చెప్పఁబడుచున్నది గావున దోషము లేదు, "మంత్రేషు జామితా నాస్తి" అని పూర్వమందే చెప్పఁబడినది. ఋతసత్ = నిష్పాదకుఁడై యజ్ఞమం దుండువాఁడు, వ్యోమసత్ = సూర్యరూపముతో నాకాశమం దుండువాఁడు, అబ్జాః = జలములయందుఁ బుట్టువాఁడు, గోజాః = గోవులయం దంతర్యామిగా నావిర్భవించినవాఁడు, ఋతజాః = యజ్ఞమందు భోక్తగాఁ బుట్టినవాఁడు, అద్రిజాః = పర్వతములయందుఁ బుట్టినవాఁడు నగు పరమాత్మ, బృహత్ = అధికమగు, ఋతమ్ = ఉపాసనాత్మకయజ్ఞమును, నిష్పాదించునుగాక.

## ఉపస్థానమంత్రార్థము.

మూ॥ ఆసత్యేన రజసా వర్తమానో నివేశయ న్నమృతం మర్త్యంచ హిరణ్యయేన సవితా రథేనాఽఽదేవోయాతి భువనా విపశ్యన్ ॥

"ఆసత్యేనేతి మంత్రస్య హిరణ్యా ఋషి రీరితః,
త్రిష్టుప్ఛంద శ్చ సవితా దేవతా పరిపఠ్యతే."

టీ॰ ఆసత్యేన = సత్యస్వరూపముగలది, రజసా = రంజనాత్మకమైనదియునగు తేజోమండలముతో, ఆవర్తమానః = (సాయంప్రాతఃకాలములయందు) తిరుగుచున్నవాఁడై, అమృతమ్ = దేవాదిరూపమును, మర్త్యమ్ = మనుష్యాదిరూపమును, నివేశయన్ = బ్రతికించుచు, (దేవతలను, మనుష్యులను వారి వారిపనులకు సమర్థులైనవారినిగాఁ దనప్రకాశముచేఁ జేయుచు) సవితా = సర్వప్రేరకుఁడగు సూర్యుఁడు, హిరణ్యయేన = బంగారముచే రచింపఁబడిన, రథేన = రథముతో, దేవః = ప్రకాశించుచున్నవాఁడై, భువనాని = లోకములను, విపశ్యన్ = చూచుచు, ఆయాతి = వచ్చుచున్నాఁడు. అట్టిసూర్యుని మేము ధ్యానించుచున్నాము.

మూ॥ ఉద్వయం తమసస్పరి పశ్యంతో జ్యోతి రుత్తరమ్।
దేవం దేవత్రాసూర్యమగన్మ జ్యోతిరుత్తమమ్॥

టీ. వయమ్ = మేము, తమసస్పరి = చీఁకటికి పైనున్న, దేవమ్ = ప్రకాశకమగు, ఉత్తరమ్-జ్యోతిః = ఉత్కృష్టమైన జ్యోతిస్సును, ఉత్పశ్యంతః = చూచుచున్నవారమై, దేవత్రా = దేవతలయందు సూర్యుఁడుగానున్న, దేవమ్ =

దేవుని, ఉత్తమంజ్యోతిః = ఉత్కృష్టమగు తేజస్స్వరూపుని ముక్తికొఱకు, అగన్మ = పొందితిమి.

మూ॥ ఉదు త్యం జాతవేదసం దేవంవహన్తి కేతవః
దృశే విశ్వాయ సూర్యమ్॥

టీక. 'ఉత్' అనుశబ్దము పాదపూరణార్థము. ఉకారము సుఖోచ్చారణార్థము, త్యమ్, తమ్ = ఆ, జాతవేదసమ్ = పుట్టినభూతములను తెలిసికొనువాఁడగు, దేవం, సూర్యమ్= దేవుఁడగుసూర్యుని, దృశే విశ్వాయ=అందఱకును కన్నులు కనుపడుటకు, కేతవః = కిరణములు, వహంతి = వహించుచున్నవి. లేక -ఉదిత్యమ్ = ఈ, దేవం సూర్యమ్ = దేవుఁడగు, సూర్యుని, జాతవేదసమ్= అగ్నినిగుఱించి, రశ్మయః = కిరణములు, వహంతి = మోయుచున్నవి. అనఁగా సూర్యుఁడు సాయంకాలమం దగ్నిలోఁ బ్రవేశించుచున్నాఁడు కావున ప్రాతఃకాలమందు సూర్యకిరణములు అగ్నినుండి పైకి వెడలుచున్నవి. ఇందులకు ప్రమాణము.

"అగ్నిం వావాదిత్య స్సాయంప్రవిశతి । తస్మా దగ్నిర్దూరాన్నక్తం దదృశే । ఉభేహి తేజసీ సంపద్యేతే ఉద్యంతంవావాదిత్య మగ్ని రను సమారోహతి."

మూ॥ చిత్రం దేవానా ముదగా దనీకం చక్షుర్మిత్రస్యవరుణస్యాగ్నేః। ఆప్రాద్యావాపృథివీ। అంతరిక్షగ్ం సూర్య ఆత్మా జగతః తస్థుషశ్చ.

టీ. చిత్రమ్ = నానావిధవర్ణములు గలదియు, మిత్రస్య = అహరభిమానిదేవతయు అగు సూర్యునికిని, వరుణస్య= రాత్ర్యభిమాని దేవతయగు వరుణునికిని, అగ్నేః=ఉభయాభిమా

ని దేవతయగు అగ్నికిని,చక్షుః = కన్నువంటిదియగు, దేవానామనీకమ్ = కిరణములయొక్క మండలము,ఉదగాత్ = పైకి వచ్చెను, ఉదయించెను, జగతః=జంగమములకును, తస్థుషః=స్థావరములకును, ఆత్మా = ఆత్మయగు, సూర్యః = సూర్యుఁడు, ద్యావాపృథివీ = స్వర్గమును భూమిని, అంతరిక్షమ్= అంతరిక్షమును, ఆప్రాః = నింపివైచెను.

మూ॥ తచ్చక్షుర్దేవహితం పురస్తాచ్ఛుక్రముచ్చరత్। పశ్యేమ శరదశ్శతమ్। జీవేమ శరదశ్శతమ్। నందామ శరదశ్శతమ్। మోదామ శరదశ్శతమ్।భవామ శరదశ్శతమ్। శృణవామశరదశ్శతమ్। ప్రబ్రవామ శరదశ్శతమ్। అజీతాః స్యామ శరదశ్శతమ్।జ్యోక్చ సూర్యం దృశే॥

టీక. చక్షుః=సకలజగమునకును నేత్రమైనదియు, దేవహితమ్ = దేవతలకు హితమైనదియు, శుక్రమ్ = పరిశుద్ధస్వరూపము గలదియు, పురస్తాత్ = తూర్పుదిక్కున, ఉచ్చరత్ = ఉదయించెడునదియునగు, తత్ = ఆసూర్యాత్మకమగు బ్రహ్మమును, శరదశ్శతమ్=నూఱుసంవత్సరములు ఆయురారోగ్యైశ్వర్య కాములమై, పశ్యేమ = చూతుముగాక, శరదశ్శతం జీవేమ = నూఱుసంవత్సరములు పుత్త్రపౌత్త్రధనాదులతో సమృద్ధులమై సంతసింతుముగాక. మోదామ శరదశ్శతమ్= నూఱుసంవత్సరములు హర్షమును పొందుదుముగాక. భవామ శరదశ్శతమ్ = అభివృద్ధిని పొంది నూఱుసంవత్సరము లుందుముగాక. శృణవామ శరదశ్శతమ్ = నూఱుసంవత్సరములు ప్రియవచనముల వినుచుందుముగాక, ప్రబ్రవామ శరదశ్శతమ్=నూఱుసంవత్సరములు ప్రకృష్టవక్తలమయి యుందుము

గాక, అజీతాస్స్యామ శరదశ్శతమ్ = నూఱుసంవత్సరములు శత్రువులచే జయింపఁబడనివారమైయుందుముగాక. జ్యోక్చ = చిరకాలము, సూర్యమ్ = సూర్యరూపమైన పరబ్రహ్మమును, దృశే=చూచుటకుఁ గోరుచున్నాము.

మూ॥ య ఉదగా న్మహతోఽర్ణవా ద్విభ్రాజమానస్సరి
రస్య మధ్యా త్సమావృ షభో లోహితాక్ష స్సూ
ర్యోవిపశ్చి న్మనసా పునాతు॥

టీ. యః = ఏసూర్యుఁడు, మహతః అర్ణవాత్ = గొప్పసముద్రమునుండి, ఉదగాత్ = పైకి వచ్చెనో, సరిరస్య = సలిలస్య = ఉదకముయొక్క, మధ్యాత్ = మధ్యను, విభ్రాజమానః = ప్రకాశించుచున్నవాఁడును, విపశ్చిత్ = విద్వాంసుఁడును, వృషభః=ధనములను వర్షించువాఁడు,లోహితాక్షః= ఎఱ్ఱనికిరణములు గలవాఁడును, అగు, సః, సూర్యః = ఆసూర్యుఁడు, మా = నన్ను, మనసా = మనస్సుచేతను, పునాతు= అనుగ్రహించునుగాక.

## సాయంసంధ్యయందు

## జలప్రాశన మంత్రము.

మూ॥ అగ్నిశ్చమా మన్యుశ్చమన్యు పతయశ్చ మన్యుకృతే
భ్యః పాపేభ్యో రక్షన్తామ్। యదహ్నా పాపమకా
ర్షమ్। మనసా వాచా హస్తాభ్యాం పద్భ్యా ముద
రేణ శిశ్నా అహ స్త దవలుంపతు యత్కించ
దురితం మయి సత్యే జ్యోతిషి జుహోమిస్వాహా॥

ఈమంత్రము చెప్పి సాయంకాలము జలప్రాశనము చేయవలెను. ఇందులకు పరాశరమాధవీయమునందు భరద్వాజుఁ డిట్లు చెప్పుచున్నాఁడు.

"సాయ మగ్నిశ్చ మేత్యుక్త్వా ప్రాత స్సూర్యేత్యపఃపిబేత్,
ఆపః పునంతు మధ్యాహ్నే తత ఆచమనం చరేత్."
సాయంకాలమందు "అగ్నిశ్చ మామన్యుశ్చ"
ప్రాతఃకాలమందు "సూర్యశ్చ మామన్యుశ్చ"
మధ్యాహ్నకాలమందు "ఆపః పునంతు"

అను నీమంత్రములను చెప్పి జలప్రాశనము చేయవలెను. "అగ్నిశ్చ" అను దానియర్థము.

టీ. అగ్నిశ్చ=అగ్నియు, మన్యుశ్చ=క్రోధమును, మన్యుపతయశ్చ = క్రోధస్వాములగు రాగద్వేషాదులును, మన్యుకృతేభ్యః=కోపముచేతను చేయఁబడిన, పాపేభ్యః=పాపములనుండి, మామ్=నన్ను, రక్షంతామ్=రక్షింతురుగాక. మనసా=మనస్సుచేతను, వాచా=వాక్కుచేతను, హస్తాభ్యామ్=హస్తములచేతను, పద్భ్యామ్ = పాదములచేతను, ఉదరేణ = ఉదరముచేతను, శిశ్నా=శిశ్నముచేతను, అహ్నా = పగటియందు, యత్పాప మకార్షమ్=ఏపాపమును జేసితినో, తత్ = ఆపాపమును, అహః=అహరభిమానిదేవత, అవలుంపతు = నశింపఁజేయునుగాక. మయి=నాయందు, యత్కించదురితమ్=ఇంకను ఏపాపము కలదో, ఇదమ్ = ఈపాపమును, మామ్=నన్ను, అమృతయోనౌ = మరణరహిత జగత్కారణమును, సత్యే = త్రికాలాబాధ్యమును నగు, జ్యోతిషి = స్వయంప్రకాశమాన

మగు పరమాత్మయందు, జుహోమి = హోమము చేయు చున్నాను. స్వాహా=బాగుగ హుతమగుగాక.

సాయంసంధ్యయం దుపస్థాన మంత్రము.

మూ॥ ఇమం మే వరుణ శ్రుధీ హవ మద్యా చ మృడయ
త్వామవస్యు రాచకే॥

(పూర్వము శునశ్శేపుఁడను ఋషిపుత్త్రుఁ డొకఁడు పశువుగా యూపస్తంభమునకుఁ గట్టఁబడినవాఁడై తద్బంధ విమోచనార్థము వరుణదేవు నీమంత్రముచే స్తుతించెను.)

టీ. హేవరుణ=ఓయివరుణుఁడా!, మే=నాయొక్క, ఇమం హవమ్=ఈపిలుపును, శ్రుధి=వినుము. అద్యా=అద్య=(సంహితాయాం నిపాతస్య-సంహితయందు నిపాతలక్ష్య-అకారము నకు దీర్ఘము వచ్చును. అనుసూత్రముప్రకారం మిచట "ద్య" అను దానికి దీర్ఘము వచ్చినది.) ఇప్పుడు, మృడయ = (నాకట్టు విప్పి) సుఖింపఁజేయుము. అవస్యుః=ఆత్మరక్షణము గోరుచున్న వాఁడనై, ఆచకే = నిన్ను రక్షకునిగాఁ గోరుచున్నాను.

మూ॥ తత్త్వాయామి బ్రహ్మణా వందమాన స్తదాశాస్తే
యజమానో హవిర్భిః అహేడమానో వరుణేహ
బోధ్యురుశగ్ సమాన ఆయుః ప్రమోషీః ॥

టీ. తత్-తస్మై=ఆరక్షణముకొఱకు, బ్రహ్మణా = స్తుతి రూపమగు మంత్రముచే, వందమానః = నమస్కరించుచున్న వాఁడనై, త్వా = నిన్ను, యామి = పొందుచున్నాను. (నీవు భక్తజనరక్షకుఁడవు గావున నిన్నే భజించుచు శరణాగతుఁ డనైతిని. అందువలన నన్ను బంధవిముక్తుని గావించి సుఖింపఁ

జేయుము. ఇట్లు చేయనియెడల శరణాగతపరిత్యాగము మహా దోషమును గలిగించును. ఇది నాయభిమతమే కాదు యజ మానునికిఁ గూడ నారక్షణము కోరఁదగినది.)

యజమానః=యజ్ఞము చేయుచున్నవాఁడు, హవిర్భిః = హవిస్సులతో, ఆశాస్తే = (ఆరక్షణమును) కోరుచున్నాఁడు. కావున తప్పక నన్ను రక్షింపుము. హే వరుణ=ఓయివరుణుఁడా, అహేడమానః = అనాదరముచేయక, లేదా కోపగించక, ఇహ=ఇప్పుడు, బోధి = (నాప్రార్థనను) తెలిసికొనుము. హే ఉరుశంస=మిక్కిలి కీర్తనీయుఁడా, నః = మాయొక్క, (యజ మానునిగూడఁ గలుపుకొనుటకై బహువచనము) ఆయుః = ఆయుష్యమును, మాప్రమోషీః=నశింపఁజేయకుము (వేదోక్తా యుష్యము మాకొసంగుము.)

మూ॥ యచ్చిద్ధితే విశో యథా ప్రదేవ వరుణవ్రతమ్, మినీ
మసి ద్యవిద్యవి॥

టీ. యత్, చిద్ధి=అనునీరెండును, పాదపూరణార్థమైన అవ్యయములు. హే వరుణ=ఓయివరుణుఁడా!, యథావిశః = ప్రజలెట్లు తమవ్యాపారములనుగూర్చి ఆలోచింతురో అట్లు, తే=నీయొక్క, యద్వ్రతమ్ = ఉపాసనాత్మకమగు వ్రతమేది కలదో, తత్=దానిని, ద్యవిద్యవి = ప్రతిదినమును, మినీమసి = ప్రకృష్టముగా నాలోచింతుము.

మూ॥ యత్కించేదం వరుణదైవ్యేజనేఽభిద్రోహం మను
ష్యాశ్చరామసి, అచిత్తీ యత్తవ ధర్మాయుయోపి
మ మా న స్తస్మా దేనసో దేవ రీరిషః॥

టీ. హే వరుణ=ఓయివరుణుఁడా!, దైవ్యే జనే=దేవలోకమం దుండెడుజనుఁడ వైన నీయందు, యత్కించ = కొంచెము, అభిద్రోహమ్=అనాచారరూపమగు ద్రోహమును, అచిత్తీ=అజ్ఞానముచే, మనుష్యాః=మనుష్యులమైన మేము, చరామసి=చేయుచున్నాము. యత్తవధర్మా (ఇచటధర్మము ఛాందసము) నీసంబంధమగు కర్మమును, యుయోపిమ = నశింపఁ జేయుచున్నాము. హే దేవ=ఓయివరుణదేవుఁడా, తస్మా దేనసః=ఆపాపమునుండి, నః=మమ్ములను, మారీరిషః = హింసింపకుము. (ధర్మలోపనిమిత్తమగు పాపమును పరిహరించిమమ్మును రక్షింపుము.)

మూ॥ కితవాసో యద్రిరిపు ర్నదీవి యద్వాఘా సత్య ముత యన్న విద్మ। సర్వాతా విష్య శిథిరేవ దేవా థాతే స్యామ వరుణ ప్రియాసః॥

టీ. కితవాసః = ధూర్తులైన ఋత్విజులు, యత్ = ఏకర్మాంగమును, రిరిపుః=నశింపఁజేసిరో, నదీవి = తిన్ననివ్యవహారమందుఁ బ్రవర్తించలేదో లేక, కితవాసః = కపటముగలవారమై, యత్ = ఏకారణముచే, రిరిపుర్న = శత్రువులవలె, (ఇచటనకారము ఇవార్థకము) దివి = నిషిద్ధకార్యములు చేసితిమో, యద్వా-ఉత-ఈరెండవ్యయములును ప్రకారాంతరమును బోధించును. ఘా-పాదపూరణ వాచకము. యద్వా= లేక, యత్ అఘమ్=ఏపాపమును, సత్యమ్=తెలిసిచేసితిమో, ఉతాపి= లేక, యత్ నవిద్మ = ఏధర్మము నెఱుఁగమో లేదా; ఏపాపమును తెలియక చేసితిమో; సర్వాతా=వానినన్నిటిని, శిథిరా ఇవ = శిథిలములగునట్లు, విష్య = తొలఁగింపుము. హే

దేవ=ఓయివరుణుఁడా, అథ = తర్వాత, తే=నీకు, ప్రియాసః= ప్రియులమయ్యెదము. పూర్వోక్తములగు మంత్రములయందు వరుణలింగ ముండుటవలన వీనిచే వరుణోపస్థానము యుక్తము గాని సూర్యోపస్థాన మెట్లని శంక తోఁచుచున్నది. కాని "వారుణీభి రాదిత్య ముపస్థాయ ప్రదక్షిణమ్" అనుద్వితీయా శ్రుతిచే (వరుణ) లింగము బాధిత మగుటవలన నీమంత్ర మును సూర్యోపస్థానమందు వినియోగింపవచ్చును. ఈయంశ ము పూర్వమీమాంసా తృతీయాధ్యాయ తృతీయపాదమందు పదునాల్గవ సూత్రమగు "శ్రుతిలింగవాక్య ప్రకరణస్థాన సమాఖ్యానాం సమవాయే పారదౌర్బల్య మర్థవిప్రకర్షాత్" అను దానియందు నిశ్చయింపఁబడినది. "ఐంద్ర్యాగార్హపత్య ముపతిష్ఠతే" అనుస్థలమందు - ఇంద్రుఁడు దేవతగాఁగల ఋక్కునకు ఐంద్రి అని పేరు. ఆఋక్కు "కదాచన స్తరీర సినేంద్రశ్చసీ" త్యాదికము. దీనిచే నింద్రునుపస్థానము చేయ వలయునా? లేక; ద్వితీయాశ్రుతిచే గార్హపత్యమునా ? అని సంశయము కలుగఁగా పైనుదాహరింపఁబడిన "శ్రుతిలింగేతి" న్యాయము ననుసరించి లింగముకంటె శ్రుతి బలిష్ఠము గావున గార్హపత్యమునే ఉపస్థానము చేయవలయు నని నిర్ణయింపఁ బడినది. ఇచటఁగూడ నట్లే చూచుకొనవలయును. ఈయంశ ము పరాశరమాధవీయమందు విపులముగాఁ జర్చింపఁ బడినది.

## ఆశౌచమందు సంధ్యావందన మెట్లు ?

ఆశౌచమందు సంధ్యావందనము చేయవచ్చునా? లేక చేయఁగూడదా? అని సంశయము. ఆశౌచాదులయందు

సంధ్యావందన మర్ఘ్యాంతము చేయవలయు నని కొన్నిస్మృతులలోఁ జెప్పఁబడి యున్నది. మఱికొన్నిస్మృతులలో విశేషము చెప్పఁబడియున్నది. ఎట్లనః—

"సంధ్యా మిష్టించ హోమంచ యావజ్జీవం సమాచరేత్,
న త్యజే త్సూతకే వాపి త్యజ న్గచ్ఛ త్యధోగతిమ్"

సంధ్యను, ఇష్టిని, హోమమును బ్రతికి యున్నంత కాలము చేయవలెను. ఆశౌచమందు కూడ విడువఁగూడదు. విడిచినచో నధోగతిపా లగును. ఇది మానసికసంధ్యావందనపర మగువచనము.

పులస్త్యుఁ డిట్లు చెప్పుచున్నాఁడు.

"సూతకే మృతకే చైవ సంధ్యాకర్మ న సంత్యజేత్,
మనసోచ్చారయేన్మంత్రాన్ ప్రాణాయామమృతే ద్విజః"

జాతాశౌచమృతాశౌచములయందు సంధ్యాకర్మము విడువఁ గూడదు. ప్రాణాయామము తప్పనితరమంత్రములను మనస్సులో నుచ్చరింపవలెను. బ్రాహ్మణునికిఁ దాత్కాలిక శుద్ధి కలుగును గావున నాశౌచము సంధ్యానుష్ఠానము నడ్డదని పరాశరుఁడు చెప్పియున్నాఁడు.

"ఉపాసనే తు విప్రాణా మంగశుద్ధిశ్చ జాయతే"
ఉపాసనమందు బ్రాహ్మణులకు శరీరశుద్ధి కలుగుచున్నది.
"అగ్నిహోత్రాదిహోమార్థం శుద్ధి స్తాత్కాలికీ స్మృతా"

అని గోభిలుఁడు. ఆశౌచ మయోగ్యకాల మగుటచేఁ గర్మాధికారమును నిరోధించు నని పరాశరుఁడు, మరీచి మొదలగువారు పలుకుచున్నారు.

"సర్వకాల ముపస్థానం సంధ్యాయాః పార్థివేష్య తే,
అన్యత్ర సూతకాశౌచ విభ్రమాతురభీతితః"

జాతాశౌచము, చిత్తచాంచల్యము, రోగము మొదలగు వానియందుఁ దప్ప నితరసమయములయం దెప్పుడును సంధ్యాకర్మము విడువఁగూడదు.

"సూతకే కర్మణాం త్యాగ స్సంధ్యాదీనాం విధీయతే"
(సూతకమందు సంధ్యాదికర్మముల యొక్క త్యాగము విధింపఁబడుచున్నది)

పూర్వోక్తములగు పులస్త్యాదివచనములనుబట్టి ఆలోచింపఁగా నాచమనము మొదలుకొని అభివాదనాంతము సంధ్యావందనము నంతయును జేయఁగూడ దని తాత్పర్యము.

"ప్రాణాయామం వినా మానసిక మన్య త్కార్యమ్"

అని పరాశరమాధవీయమందుఁ జెప్పఁబడినట్లు ప్రాణాయామమునువిడిచిపెట్టి తక్కినకర్మమును మానసికముగాఁ జేయవలయునని సిద్ధాంతము.

వ్యాధిగ్రస్తుఁ డెట్లు సంధ్యావందన మాచరింపవలెను ?

జ్వరాదులచేఁ బీడితుఁడగువాఁడు పూర్ణముగా సంధ్యవార్చక పోయినను దోషము లేదు. స్వస్థుఁడై యున్నవానికే ఆనియమము.

"అనార్త శ్చోత్సృజే ద్యస్తు స విప్ర శ్శూద్రసమ్మితః,
ప్రాయశ్చిత్తీ భవేచ్చైవ లోకే భవతి నిందితః"
అని యాజ్ఞవల్క్యుఁడు.

"నోపతిష్ఠంతి వై సంధ్యాం స్వస్థావస్థాశ్చ యే ద్విజాః,
హింసంతి చ సదా తే వై భగవంతం దివాకరమ్"
అని అత్రి.

రోగము లేకుండ సంధ్యను విడుచు బ్రాహ్మణుఁడు శూద్రతుల్యుఁ డగును. వాఁడు ప్రాయశ్చిత్తము చేసికొనవల యును. వాఁడు లోకమందు నింద్యుఁడు. రోగములేనివా రై సంధ్యను వార్చనివారు సూర్యుని హింసించువా రగుదురు.

మంచముమీఁదనుండి లేవలేనంత రోగముతో నున్న వానిగతి యేమి?

వానిసోదరుఁడు గాని, తండ్రిగాని వాఁడొనర్పవలసిన సంధ్యావందనము నాచరింపవలెను. అంతియ కాని బొత్తిగా మానఁగూడదు.

"ఉన్మత్తదోషయుక్తస్య వ్యాధితస్య చ నిత్యశః,
పితా భ్రాతా తథాన్యో వా సంధ్యావందనమాచరేత్"

అని స్మృతికారులు చెప్పుచున్నారు. వెఱ్ఱివాఁడు, నిత్యరోగి చేయవలసిన సంధ్యావందనమును వానిసోద రుఁడు గాని తండ్రి గాని యితరుఁడు గాని చేయవలెను. జ్వరాదులచేఁ గొంచెము బాధనొందుచున్నపుడు ధౌత వస్త్ర మును ధరించి కూర్చుండి యూర్ధ్వపుండ్రముగాని తిర్యక్పుం డ్రమును గాని ధరించి వాఙ్మౌనముగలవాఁడై యిష్టదేవ తను ధ్యానించుచు ఉష్ణోదకముచే ముమ్మా రాచమనము చేసి తనశక్తికొలఁది సంధ్యావందన మాచరింపవలెను. రోగముతో నున్నవాఁ డుష్ణోదకముల నాచమింపవచ్చు నని అపస్తంబుఁడు చెప్పుచున్నాఁడు. "తప్తాభిశ్చ కారణాత్" (జ్వ

రాదిపీడితుఁడై యున్నపు డుష్ణోదకములచే నాచమనము
చేయవచ్చును. అశక్తుఁడై యున్నపుడు తండ్రిని గాని
సోదరుని గాని శిష్యునిగాని పిలిచి "నేనశక్తుఁడనై యు
న్నాను గావున నాకొఱకు నీవు "యజమానస్య ఉపాత్తదురి
తక్షయార్థమ్" అని సంకల్పము చెప్పి సంధ్యావందనము
చేయవలయు" నని నియమింపవలెను. దీనిచే నుస్మత్తవిషయ
ముకూడ వ్యాఖ్యాత మయ్యెను.

ఆంధ్రదేశపుస్మార్తబ్రాహ్మణులయజుస్సంధ్యావందనము
ముగిసెను.

---

## ద్రావిడదేశస్థ శ్రీవైష్ణవ సంధ్యావందనము.

### ప్రాతస్సంధ్యావందనము.

స్నాత్వా(స్నానముచేసి)ఊర్ధ్వపుండ్రంధృత్వా (ఊర్ధ్వ
పుండ్రమును ధరించి) ప్రాఙ్ముఖ ఉదఙ్ముఖోవా స్థిత్వా(తూర్పు
వైపుగాని ఉత్తరదిక్కువైపుగాని తిరిగియుండి) ఆచమ్య
(ఆచమనము చేసి) ఓం అచ్యుతాయ నమః। ఓం అనంతాయ
నమః। ఓం గోవిందాయ నమః। ఇతి త్రిరపః పీత్వా (అని
మువ్మారు ఉదకమును పానముచేసి)

ఓం కేశవాయ నమః, ఓం నారాయణాయ నమః, ఓం
మాధవాయనమః, ఓం గోవిందాయ నమః, ఓం విష్ణవే నమః,
ఓం మధుసూదనాయ నమః, ఓం త్రివిక్రమాయ నమః, ఓం
వామనాయనమః, ఓం శ్రీధరాయనమః, ఓం హృషీకేశాయ
నమః, ఓం పద్మనాభాయ నమః,ఓం దామోదరాయ నమః,
అని-చెప్పి అంగన్యాసం కుర్యాత్. (అంగన్యాసము చేయ

వలెను) ప్రాణాయామము "ఓం భూః, ఓం భువః, ఓగ్ సువః, ఓం మహః, ఓం జనః, ఓం తపః, ఓగ్ సత్యం, ఓం తత్సవితు ర్వరేణ్యమ్, భర్గో దేవస్య ధీమహి, ధియో యో నః ప్రచో దయాత్. ఓమాపోజ్యోతీ రసోమృతం బ్రహ్మ భూ ర్భువ స్సువరోమ్ – శ్రీభగవదాజ్ఞయా భగవత్ప్రీత్యర్థం శ్రీభగ వత్కైంకర్యరూపాం ప్రాతస్సంధ్యా ముపాసిష్యే."

అని సంకల్పము చెప్పి,

మం॥ ఆపో హిష్ఠేతి మంత్రస్య సింధుద్వీప ఋషిః । దేవీ గాయత్రీ చ్ఛందః। ఆపో దేవతా । ఇతి శిరోజిహ్వా హృదయే, అనంగుష్ఠాభి రంగుళీభి స్స్పృష్ట్వా॥

బొటకనవ్రేలు విడిచి తక్కిన నాలుగువ్రేళ్లతోను శిర స్సును, జిహ్వను, హృదయమును స్పృశించి,

"అపాం ప్రోక్షణే వినియోగః"

అని చెప్పి,

మం॥ ఓం ఆపోహిష్ఠా మయో భువః, ఓం తాన ఊర్జే దధా తన, ఓం మహే రణాయ చక్షసే, ఓం యోవశ్శివతమో రసః, ఓం తస్యభాజయతేహ నః, ఓం ఉశతీరివ మాతరః, ఓం తస్మా అరం గమామ వః.

ఈ మంత్రము లుచ్చరించుచు ప్రత్యేకముగా శిరస్సు నందు ప్రోక్షించుకొని,

"ఓం యస్య క్షయాయ జిన్వథ"

అని చెప్పి రెండుపాదములయందును ప్రోక్షించుకొని,

ఓం "ఆపో జనయథాచనః"

అని మరల శిరస్సునందు ప్రోక్షించుకొని,

"ఓం భూర్భువ స్సువః"

అని తనపై నీళ్లు చల్లుకొని పిమ్మట "సూర్యశ్చ మామ న్యుశ్చ"

అనుజలప్రాశన మంత్రము నుచ్చరించి జలప్రాశనము చేయవలయును.

పూర్వోక్తమార్జనమంత్రముల కర్థము.

ఆపో హి ష్ఠా మయోభువః

టీ. ఆపః = ఉదకములారా!, (యూయం = మీరు) మయోభువః = (సర్వప్రాణులకును) సుఖస్థానములై, స్థా హి = ఉన్నారు. తాః = అట్టిమీరు. మహే= గొప్పదియు,రణాయ= (రమణీయాయ) రమణీయమైనదియునగు, చక్షసే = ఇంద్రియప్రకాశసిద్ధికొఱకు, అనఁగా నింద్రియజన్యజ్ఞానముకొఱకు, నః = మాకు, ఊర్జే = అన్నమును, దధాతన = ఇత్తురుగాక, వః=మీకు, యః = ఏ, శివతమః = పుణ్యతమమైన, రసః=సుఖరూపమగు పరమాత్మ కలదో, తస్య = ఆపరమాత్మను, నః = మమ్ములను, ఇహ=ఈజన్మమందు, ఉశతీః = ప్రీతిగల, మాతరఇవ=తల్లులవలెనే, భాజయత=పొందించుఁడు. (యూయం = మీరు) యస్య = ఏపరబ్రహ్మముయొక్క, క్షయాయ = నివాసముకొఱకు, జిన్వథ = సంతసిల్లుచున్నారో, తస్మై = ఆపరమాత్మకొఱకు, వః = మిమ్ములను, అరమ్ = శీఘ్రముగా, గమామ = మేము పొందుదుముగాక. హే ఆపః = ఓఉదకము

లారా!, నః = మమ్ములను, జనయథాచ = సత్తిగలవారినిగాఁ జేయుఁడు. (బ్రహ్మసాక్షాత్కార యోగ్యులనుగాఁ జేయుఁడు. బ్రహ్మానుభవమున కుపయోగమైన ఐహికసమృద్ధిని బ్రహ్మానుభవమును మా కనుగ్రహింపుఁడు)

జలప్రాశన మంత్రము

మూ॥ సూర్యశ్చేత్యనువాకస్య అగ్నిః ఋషిః, దేవీగాయత్రీ చ్ఛందః, సూర్యో దేవతా, అని న్యాసము చేసి, "అపాంప్రాశనే వినియోగః" అని చెప్పి ఆచమనజలము ను చేతిలోఁ బోసికొని "సూర్యశ్చ మామన్యుశ్చ మన్యుపతయశ్చ మన్యుకృతేభ్యః పాపేభ్యో రక్షంతాం యద్రాత్రియా పాప మకార్షం మనసా వాచా హస్తాభ్యాం పద్భ్యాముదరేణ శిశ్నా రాత్రి స్తదవలుంపతు యత్కించ దురితం మయి, ఇదమహం మా మమృతయోనౌ సూర్యే జ్యోతిషి జుహోమి స్వాహా"

అను అనువాకముచే జలప్రాశనము చేయవలయును.

టీ. సూర్యశ్చ = నిరుపాధికప్రేరకుఁడగు పరమాత్మయును, మన్యుశ్చ=క్రోధమును, మన్యుపతయశ్చ = కోపమును పుట్టించు రాగాదులును, మా=నన్ను, మన్యుకృతేభ్యః=క్రోధాదులచేఁ జేయఁబడిన, పాపేభ్యః=పాపములనుండి, రక్షంతామ్=రక్షింతురు గాక, (సర్వేశ్వరుఁడే, క్రోధము మొదలగు వానిని నివర్తింపఁజేసి మమ్మును పాపసమూహమునుండి విముక్తి నొందునట్లు చేయు నని తాత్పర్యము. ఇందువలన ఉత్తరాఘము లంటకపోవుట చెప్పఁబడినది) రాత్రియా=రాత్రి

యందు, మనసా=మనస్సుచేతను, వాచా = వాక్కుచేతను, హస్తాభ్యామ్=చేతులచేతను, పద్భ్యామ్ = పాదములచేతను, ఉదరేణ=ఉదరముచేతను, శిశ్నా = శిశ్నేంద్రియముచేతను, యత్ పాపమ్=ఏపాపమును, అకార్షమ్=చేసితినో,తత్ =ఆపాపమును, రాత్రిః=(రా=ఆదానే,త్రైఙ్ =పాలనే, అనుధాతువుల నుండి రాత్రిశబ్దము నిష్పన్న మయినది. రాధాతువువలన సర్వమును తనయొద్దికిఁ దీసికొనువాఁడు జగత్సంహర్త యని అర్థము. త్రైఙ్ధాతువువలన రక్షించువాఁడని యర్థము.) చతుర్విధపురుషార్థప్రదాతయు, నిరుపాధికరక్షకుఁడును నగు పరమాత్మ, అవలుంపతు = నశింపఁజేయునుగాక, (ఆపాపములు మూఁడువిధములు. వానిలో అభక్ష్యభక్షణము, అభోజ్యభోజనము, అపేయపానము, అసత్ప్రతిగ్రహము, పరదారాభిమర్శనము, పరద్రవ్యాపహరణము, ప్రాణిహింసము ఇవి శారీరపాపములు. వాక్పారుష్యము, అనృతము, వివాదము, శ్రుతివిక్రయము ఇవి వాచికపాపములు. పరపతాపనము, పరాభిద్రోహము, క్రోధలోభమోహాహంకారములు ఇవి మానసికపాపములు. ఇందువలన ప్రశ్నునికి పూర్వాఘనాశనము చెప్పఁబడినది.) మయి = నాయందు, యత్కించ దురితమ్ = ఇంకను మఱియేపాపము గలదో ఆపాపమునుగూడ నశింపఁజేయును. ఇదమ్=ఈ, అహమ్ = అనన్యగతికుఁడను, అకించనుఁడను అయిననేను, అమృతయోనౌ=మోక్షమునకు కారణభూతుఁడును, జ్యోతిషి = నిరుపాధికతేజస్స్వరూపుఁడును నగు, సూర్యే=నియంతయగు పరమాత్మయందు. స్వాహా=స్వాహా అని, మామ్=నన్ను, జుహోమి=సమర్పించుచున్నాను.

జగత్కారణభూతుఁడును మోక్షప్రదుఁడును నగు శ్రియఃపతియందీయాత్మను సమర్పించినయెడల నతఁడు సకలప్రతిబంధకనివృత్తిపూర్వకముగాఁ దన - అనుభవము నొసంగును. మరల నాచమనము చేసి "దధిక్రావ్ణ ఇతి మంత్రస్య వామదేవ ఋషిః, అనుష్టుప్ ఛందః, దధిక్రావా దేవతా" అని న్యాసము చేసి "అపాం ప్రోక్షణే వినియోగః" అని చెప్పి "దధిక్రావ్ణో అకారిషమ్। జిష్ణో రశ్వస్య వాజినః। సురభినో ముఖా కరత్ ప్రణ ఆయూగ్ంషి తారిషత్॥"

టీక. జిష్ణోః = దుష్టులను జయించు స్వభావముగలవాఁడును, అశ్వస్య=సర్వవ్యాపకుఁడును, వాజినః=భక్తరక్షణమందు త్వరగలవాఁడును అగు, దధిక్రావ్ణః = జగత్తులనాక్రమించిన పరమాత్మయొక్క స్తోత్రమును, అకారిషమ్=చేసితిని,సః= ఆపరమాత్మ, నః=మాయొక్క, ముఖా = ముఖములను మనస్సును, సురభి=పరిశుద్ధమయినవానినిగా, కరత్ =చేయునుగాక, నః=మాకు, ఆయూగ్ంషి=ఆయుష్యములను, ప్రతారిషత్ = ఉపద్రవము లేకుండ పూర్ణమయినవానినిగాఁ జేయునుగాక, (ఆయుష్యము లేకపోయినను ఆయుష్య మున్నను వ్యాధి మొదలగునవి బాధించినయెడల స్తోత్రము చేయుట కశక్తుఁడగునుగావున భగవంతుని స్తోత్రము చేయుట కుపయోగముగా నాయురారోగ్యములు ప్రార్థింపఁబడినయెడల ప్రపన్నునిమముక్షుకు హాని లేదనియెఱుఁగవలయు నని తాత్పర్యము.)

మూ॥ ఆపో హి ష్ఠా మయోభువః। తా న ఊర్జేదధాతన। మహేరణాయ చక్షసే। యో వశ్శివతమో రసః।

తస్య భాజయ తేహ నః। ఉశతీరివ మాతరః। తస్మా
అరం గమామ వః॥

అను నీమంత్రము లన్నియుఁ జెప్పి పూర్వమువలెనే శిరస్సునందు ప్రోక్షించుకొని,

"యస్య క్షయాయ జిన్వథ" అని పాదద్వయమందును,
"ఆపో జనయథా చ నః"

అని మరల శిరస్సునందును ప్రోక్షించుకొని,

"ఓం భూర్భువ స్సువః"

అని తనచుట్టు నుదకము త్రిప్పికొని,

మ॥ అంజలినా జలమాదాయ-ద్రుపదాదివ ముంచతు -
ద్రుపదాదివేన్ముముచానః-స్విన్నస్స్నాత్వీమలాదివ-
పూతం పవిత్రేణైవాజ్యమ్। ఆపశ్శుంధంతు మైనసః॥

అనుమంత్రముచే జలము నాఘ్రాణించి వామపార్శ్వమునందు విడువవలెను. ప్రాణాయామము చేసి,

"ఓం అర్ఘ్యప్రదానమంత్రస్య। విశ్వామిత్రఋషిః। దేవీ గాయత్రీచ్ఛందః। సవితా దేవతా"

అని న్యాసము చేసికొని,

"అర్ఘ్యప్రదానే వినియోగః"

అని చెప్పి ప్రణవముతోను వ్యాహృతులతోనుగూడిన గాయత్రీమంత్రమును (ఓంభూర్భువ స్సువః। తత్సవితుర్వరేణియం భర్గో దేవస్య ధీమహి। ధియో యో నః ప్రచోదయాత్.) అని ఉచ్చరించి ఆదిత్యాన్తర్వర్తి యగు భగవంతుని ధ్యానించుచు రెండుమడమల నెత్తి నిలువఁబడి తర్జన్యంగుష్ఠ

సంయోగరూపమగు రాక్షసముద్ర లేకుండ దోసిలితో జల
మును గ్రహించి కనుబొమ్మలవఱకు నెత్తి అర్ఘ్యత్రయమును
జలమధ్యమందు విడువవలెను. అర్ఘ్యప్రదానముకంటె
ముందు సూర్యోదయమైనయెడల ప్రాణాయామము చేసి,

"ప్రాతస్సంధ్యాకాలాతిక్రమణప్రాయశ్చిత్తార్థం తు
ర్యార్ఘ్య ప్రదానం కరిష్యే"

అని సంకల్పము చెప్పి, సప్తవ్యాహృతి సంపుటిత గా
యత్రి చే,

(ఓం భూః। ఓం భువః। ఓగ్ం సువః। ఓం మహః। ఓం
జనః। ఓంతపః। ఓగ్ం సత్యమ్। ఓం తత్సవితు ర్వరేణియం
భర్గో దేవస్యధీమహి। ధియో యో నః ప్రచోదయాత్। ఓం
భూః। ఓం భువః। ఓగ్ం సువః। ఓం మహః। ఓం జనః। ఓం
తపః। ఓగ్ంసత్యమ్)

అని చెప్పి నాలుగవ అర్ఘ్యము నిచ్చి,

"ఓం భూర్భువస్సువః"

అని తనచుట్టును జలమును త్రిప్పుకొని ప్రదక్షిణము
చేసి,

"అసావాదిత్యో బ్రహ్మ"

అని ధ్యానించి ఆచమనము చేసి,

"ఓం కేశవం తర్పయామి, ఓం నారాయణం తర్ప
యామి,ఓం మాధవం తర్పయామి, ఓం గోవిందం తర్పయామి
ఓం విష్ణుం తర్పయామి, ఓం మధుసూదనం తర్పయామి, ఓం
త్రివిక్రమం తర్పయామి, ఓం వామనం తర్పయామి, ఓం

శ్రీధరం తర్పయామి, ఓం హృషీకేశం తర్పయామి, ఓం పద్మ నాభం తర్పయామి, ఓం దామోదరం తర్పయామి.

అని ప్రత్యేకముగ ధ్యానించి తర్పణము చేయవలెను.

జలమందు సంధ్య వార్చిన యెడల మోఁకాలుబంటి నీటిలో నిలువఁబడి సంధ్య వార్చవలెను. స్థలమందు చేసిన యెడల కుక్కుటాసనమందుఁ గూరుచుండి చేయవలెను. లేక; స్థలమం దొకపాదము జలమం దొకపాదమును ఉంచి సంధ్యా నుష్ఠాన మొనర్చినయెడల నంతర్బహిశ్శుద్ధి కలవాఁ డగును. తడిబట్టతో సంధ్య వార్చఁగూడదు. అట్లు చేసినచో మోఁకాలు బంటినీటిలో నిలువఁబడి ప్రదక్షిణనమస్కారములు లేకుండ నుపస్థానము చేయవలెను.

దేవాలయమునకుఁగాని, తత్సమీపస్థలమునకుఁగాని పోయి యచట వ్యాహృతులచే నాప్రదేశమును ప్రోక్షించి ప్రాగగ్రములుగా నచట దర్భలు పరిచి,

"ఆసనమంత్రస్యపృథివ్యా మేరుపృష్ఠ ఋషిః, సుతలం ఛందః, శ్రీకూర్మో దేవతా"

అని న్యాసము చేసి "ఆసనే వినియోగః" అని చెప్పి,

"పృథ్వి త్వయా ధృతా లోకా దేవి! త్వం విష్ణు నాధృతా,

త్వంచ ధారయ మాం దేవి! పవిత్రం కురు చాసనమ్."

అని భూమిని ప్రార్థించి,

మూ॥ ప్రణవస్య ఋషిః బ్రహ్మ । దేవీ గాయత్రీ ఛందః। పరమాత్మా దేవతా । భూరాదిసప్తవ్యాహృతీనాం అత్రి భృగు కుత్స వసిష్ఠ గౌతమ కాశ్యపాంగిరస ఋషయః । గాయత్ర్యుష్ణిగనుష్టుబ్బృహతీపంక్తిత్రిష్టుబ్జగత్య శ్ఛందాంసి । అగ్ని వాయ్వర్క వాగీశవరుణేన్ద్రవిశ్వేదేవా దేవతాః। సావిత్ర్యాఋషి ర్విశ్వామిత్రః । దేవీ గాయత్రీ ఛందః। సవితా దేవతా। గాయత్రీశిరసో బ్రహ్మ ఋషిః । అనుష్టుప్ ఛందః। పరమాత్మా దేవతా॥

అని న్యాసముచేసి "సర్వేషాం ప్రాణాయామే విని యోగః"

"ఓం భూః" అని పాదములయందు
"ఓం భువః" అని పిక్కలయందు
"ఓగ్ సువః" అని మెుడుకులయందు
"ఓం మహః" అని ఉదరమందు
"ఓం జనః" అని కంఠమందు
"ఓం తపః" అని ముఖమందు

"ఓగ్ం సత్యమ్" అని శిరస్సునందు న్యాసము చేయవలయును.

"ఓం తత్సవితుః జ్ఞానాయ హృదయాయ నమః" అంగుష్ఠముతోఁగూడిన తర్జనిచే హృదయమందు, 'ఓం వరేణియమ్ ఐశ్వర్యాయశిరసే స్వాహా' అని బొటకన వ్రేలుకలియని తక్కిన వ్రేళ్లతో శిరస్సునందు, 'ఓం భర్గోదేవస్య శక్త్యై

శిఖాయై వషట్' అని అధోముఖముగాఁ జేయఁబడి అంగుష్ఠ నాళముతోఁ గూడిన పిడికిలిచే శిఖామధ్యమందు, "ఓం ధీమహి బలాయ కవచాయ హుమ్" అని కంఠము మొదలుకొని కటిప్రదేశమువఱకును చేతులతో కవచమువలె స్పృశించి, "ఓం ధియో యో నః తేజసే నేత్రాభ్యాం వౌషట్" అని చూపుడువ్రేలికొనచేతను నడిమివ్రేలి కొనచేతను, రెండు కన్నుల నొక్కుమాఱు, "ఓం ప్రచోదయాత్ వీర్యాయాస్త్రాయ ఫట్" అని అంగుష్ఠముతోఁ గూడి తర్జన్యగ్రముచే తూర్పు మొదలుగాఁగల నాల్గుదిక్కులను, ఆగ్నేయము మొదలగు విదిక్కులను బంధింపవలెను.

ఇట్లంగన్యాసము చేసి ధ్యానశ్లోకము.

"ముక్తావిద్రుమహేమనీలధవళచ్ఛాయైర్ముఖైస్త్రీక్షణై
ర్యుక్తామిందుకలానిబద్ధమకుటాం తత్త్వార్థవర్ణాత్మికామ్,
గాయత్రీం వరదాభయాంకుశకశాం శుభ్రం కపాలంగదాం ·
శంఖం చక్ర మథారవిందయుగళం హస్తైర్వహంతీం భజే."

అని ధ్యానించి,

"ఓమాపోజ్యోతీరసోఽమృతం బ్రహ్మ భూర్భువస్సువరోమ్."

అనెడు శిరోమంత్రముచే చేతులచేతను శిరస్సు మొదలుకొని పాదములవఱకును కవచముచేఁ జుట్టినట్లు స్పర్శరూపమగు వ్యాపకన్యాస మొనర్పవలెను.

"అర్కమండలమధ్యస్థం సూర్యకోటిసమప్రభమ్,
బ్రహ్మాదిసేవ్యపాదాబ్జం నౌమిబ్రహ్మరమాసఖమ్.'

అని అనుసంధించి మువ్మాఱు ప్రాణాయామము చేసి "శ్రీభగవదాజ్ఞయా శ్రీభగవత్ప్రీత్యర్థం సహస్ర మష్టోత్తరశతం ప్రాతస్సంధ్యాంగగాయత్రీమంత్రజపం కరిష్యే."

అని సంకల్పము చేసి,

మూ॥ ఆయాత్విత్యనువాకస్య వామదేవ ఋషిః। అనుష్టుప్ ఛందః। గాయత్రీ దేవతా॥

అని న్యసించి

"గాయత్ర్యావాహనే వినియోగః"

అని చెప్పి.

మూ॥ ఆయాతు వరదా దేవీ అక్షరం బ్రహ్మసమ్మితమ్। గాయత్రీం ఛందసాం మాతేదం బ్రహ్మ జుషస్వ నః। ఓజోసి సహోసి బలమసి భ్రాజోసి దేవానాం ధామ నామాసి। విశ్వమసి విశ్వాయు స్సర్వమసి సర్వాయు రభిభూరోం గాయత్రీ మావాహయామి॥

టీ. వరదా= ఆశ్రితాభీష్టఫలప్రదయగు, దేవీ=బ్రహ్మాత్మికయైనగాయత్రి, ఆయాతు=ఱమ్ముల ననుగ్రహించుటకు వచ్చునుగాక, ఆగాయత్రి యెట్టి దనిన, అక్షరమ్=నాశరహితమైనదియు, బ్రహ్మ=వేదమునకు, సమ్మితమ్=సమానమైనదియు, లేక; బ్రహ్మ=ప్రణవమునకు, సమ్మితమ్=సమానమైనదియు లేక, బ్రహ్మ=పరమాత్మతో, సమ్మితమ్=సమానమైనదియు, సర్వజగత్కారణభూతుఁడగు పరమాత్మవలెనే సర్వవాఙ్మయమూలమగు వేదమునకు తల్లి యని తాత్పర్యము. ఛందసాం=వేదములకు, మాతా=ప్రధానమైన, గాయత్రీం=

గాయత్రివైన నీవు, నః=మాయొక్క, ఇదమ్=ఈ, బ్రహ్మ=స్తోత్రమును, జుషస్వ=గ్రహించుము, ఓజో౽సి=ఇంద్రియశక్తివగుచున్నావు, సహో౽సి=వేగవంతులకు వేగ మగుచున్నావు, బలమసి=భరించువారికి బల మగుచున్నావు, భ్రాజో౽సి=ప్రకాశవంతులకుఁ బ్రకాశ మగుచున్నావు, దేవానామ్=దేవతలకు, నామ=ప్రసిద్ధమయిన, ధామాసి=స్థానమగుచున్నావు, విశ్వమసి=విష్ణువవలె సర్వాక్రమణసమర్థ మయిన దానవగుచున్నావు, విశ్వాయుః=సర్వభూతములకును ఆయుష్యమును వృద్ధినొందించుదాన వగుచున్నావు, సర్వమసి=అందఱకును నిర్వాహకురాల వగుచున్నావు, సర్వాయుః=సకలజనులకును కాలవ్యవస్థను చేయుదాన వగుచున్నావు, అభిభూః = సమస్తపాపములను తిరస్కరించుదాన వగుచున్నావు. ఇట్టి, గాయత్రీమ్=గాయత్రివైన నిన్ను, ఓం="ఓమ్" అనుమంత్రముచే, ఆవాహయామి=నాదగ్గఱకు వచ్చునట్లు ప్రార్థించుచున్నాను. ఇట్టి గాయత్రిచేత ప్రతిపాద్యుఁడు పరమాత్మ యగుశ్రీమన్నారాయణుఁడే కావున గాయత్ర్యావాహనమందుఁగూడ పరమాత్మకే ప్రాధాన్యము చెప్పఁబడినది.

పూర్వోక్తానువాకముచే గాయత్రి నావాహనము చేసి,

"ప్రాతర్ధ్యాయామి గాయత్రీం రవిమండలమధ్యగామ్,
ఋగ్వేదముచ్చారయంతీం రక్తవర్ణాం కుమారికామ్.
అక్షమాలాకరాం బ్రహ్మదైవత్యాం హంసవాహనామ్"

అని గాయత్రిని ధ్యానించి

"యో దేవ స్సవితాస్మాకం ధియో ధర్మాదిగోచరాః,
ప్రేరయే త్తస్య యద్భర్గ స్తద్వరేణ్యముపాస్మహే."
అని గాయత్ర్యర్థము ననుసంధించి,
"ఆదిత్యమండలే ధ్యాయే త్పరమాత్మాన మవ్యయమ్,
విష్ణుం చతుర్భుజం రక్తపంకజాసనమధ్యగమ్,
కిరీటహారకేయూర కటకాదివిభూషితమ్,
శ్రీవత్సవనమాలాశ్రీ తులసీ కౌస్తుభోజ్జ్వలమ్,
హరిం పీతాంబరధరం శంఖచక్రగదాధరమ్,
ప్రసన్నవదనం రత్నకుండలై ర్మండితాననమ్,
సర్వరత్నసమాయుక్త సర్వాభరణభూషితమ్."
అని ఆదిత్యమండలాంతర్గతుఁడగు భగవంతుని ధ్యానించి,

"ఓం భూర్భువస్సువః తత్సవితు ర్వరేణ్యం భర్గో
దేవస్య ధీమహి ధియో యో నః ప్రచోదయాత్"

అను గాయత్రీమంత్రమును జపింపవలెను.

ప్రణవము, వ్యాహృతులు, గాయత్రీమంత్రము మొదలగు వాని అర్థము.

'ఓమ్'

అర్థము. "అకార ఉకార మకార ఇతి" అనుశ్రుతిచే ప్రణవమునకు 'అ-ఉ-మ్.' అని మూఁడక్షరములు కలవు. ఈ మూఁడక్షరములలోను అకారము లోపించినచతుర్థి కలది. అనఁగా దీనిపైని వచ్చినచతుర్థీ విభక్తిప్రత్యయము లోపించినది. ఇది "అవ రక్షణే" అను ధాతువునుండి నిష్పన్నమై నిరుపాధికసర్వ

రక్షణార్థములను ప్రతిపాదించును. రక్షకత్వమున కుపయోగించు దయావాత్సల్యాదిగుణముల కాకర్షకము, "అకారో వై సర్వా వాక్" అనుశ్రుతిప్రామాణ్యముచే సర్వశబ్దములకును కారణమగుటవలన సర్వశబ్దములచేఁ జెప్పఁబడు సకలపదార్థములకును కారణభూతుఁడగు పరబ్రహ్మమును ప్రతిపాదించునది యయి జగత్కారణత్వమున కుపయోగించుజ్ఞానశక్త్యాదిగుణముల సూచించును. "అ. నిషేధే పుమాన్ విష్ణౌ" అని నిఘంటువు. పుంలింగమైన అకారము నిషేధమందును విష్ణువునందును వర్తించును. ఇందువలన నిది విష్ణుపరము. దీనిపై కెక్కిన "ఆయ" అనుచతుర్థ విభక్తిప్రత్యయము భగవచ్ఛేషత్వమును చెప్పుచున్నది.

ఉ

ఈపదము లక్ష్మీ వాచకము. "తదేవాగ్ని స్తద్వాయు స్తత్సూర్య స్తదు చంద్రమాః"

(అదియే, అగ్ని అదియే వాయువు, అది యే సూర్యుఁడు, అదియే చంద్రుఁడు) అను శ్రుతియందు అవధారణార్థక (నిశ్చయ) మయిన "ఏవ" కార ముండవలసినచోట ఉకార మున్నట్లీప్రణవమందుఁగూడ నీ ఉకార మవధారణమును తెలియఁజేయును.

మ.

ఈపదము "మన-జ్ఞానే" అను ధాతువునుండి పుట్టినది. ఇది జ్ఞానగుణకార్థమును జ్ఞానస్వరూపార్థకమునునై యున్నది. ఇది జీవవాచకము. జ్ఞానస్వరూపుఁడును, జ్ఞానగుణ

కుఁడును నగు జీవుఁడు సర్వరక్షకుఁడును సర్వకారణభూతుఁ డును లక్ష్మీవిశిష్టుఁడునునగు శ్రీమన్నారాయణుని కొఱకనికే శేషభూతుఁ డని ప్రణవముయొక్క వాక్యార్థము. ఈయర్థము శ్రీపాంచరాత్రస్థపద్మోద్భవ సంహితయందు

"అకారేణోచ్యతేవిష్ణు స్సర్వలోకేశ్వరో హరిః,
ఉకారేణోచ్యతే లక్ష్మీ ర్మకారో దాసవాచకః"

అని చెప్పఁబడియున్నది.

సప్తవ్యాహృతుల కర్థము.

1. ఓం భూః=భూలోకము శరీరముగాఁ గలవాఁడు.
2. ఓం భువః=భువర్లోకము శరీరముగాఁ గలవాఁడు.
3. ఓగ్ సువః=సువర్లోకము శరీరముగాఁ గలవాఁడు.

ఇవి యేడును లోకనామములు గావున తక్కిన వానికిఁ గూడ నిట్లే అర్థము చూచుకొనవలయును.

గాయత్రీమంత్రార్థము.

తత్సవితు ర్వరేణియం భర్గో దేవస్య ధీమహి. ధియో యోనః ప్రచోదయాత్, దేవస్య=ఈదేవశబ్దము, క్రీడాకాంతి గత్యాద్యర్థక మగు "దివ్" అను దివాదిధాతువునుండి నిష్పన్నమయిన దగుటచే చేతనాచేతనాత్మకసర్వజగత్సృష్ట్యాదిక్రీడలచే నానందించువాఁ డని యర్థము. ఇట్టి వాఁడును నిరతిశయకాంతియుక్తుఁడును, సవితుః=జగత్స్రష్టయు నగు వాసుదేవునియొక్క, వరేణియమ్=మహాత్ములచేఁ బ్రార్థనీయ మగు, తత్=వేదాంతప్రసిద్ధమైన, భర్గః=తేజస్సును. ధీమహి=ధ్యానించె

దము, యః=ఏ తేజస్సు, నః=మాకు, ధియః=ఉపాసనాదుల కుప యుక్తమైన సర్వజ్ఞానములను, ప్రచోదయాత్=ప్రేరణచేయునో జగత్కారణభూతుఁడును ముముక్షు జనోపాస్యుఁడును పరబ్రహ్మమును అగు పురుషోత్తముఁడు తైలధారావదవిచ్ఛిన్న రూపభక్తిని మాకొసంగుఁగాక యని తాత్పర్యము.

ఉపాయాంతరములను విడిచి భగవంతుఁడొక్కఁడే మనకు రక్షకుఁడని దృఢాధ్యవసాయముగల ప్రపన్నునికి సర్వకాలసర్వావస్థలయందును అనుసంధింపఁదగిన ద్వయమంత్రము యొక్క-అర్థము నీగాయత్రీమంత్రము ప్రతిపాదించుచున్నది. ఎట్లన:—

తత్సవితుః = ఇది యేకపదము

"తచ్ఛబ్దవాచక శ్శ్రీమాన్ గాయత్ర్యర్థ ఇతీరితః"

అను పరాశరసంహితావచనముచే తచ్ఛబ్దమునకు సకలశ్రుతిప్రసిద్ధుఁడగు శ్రియఃపతిత్వవిశిష్టుఁ డర్థ మగుటచే ద్వయమంత్రమందున్న శ్రీమచ్ఛబ్దముయొక్క అర్థము దీనియందుఁ జెప్పఁబడినది.

సవితుః = సవితృశబ్దము, "షూఙ్ ప్రాణి గర్భవిమోచనే" అను ధాతువునుండి నిష్పన్న మగుటవలన సర్వజగత్కారణము, తదుపయుక్తావాప్త సమస్తకాముఁడును, సర్వజ్ఞత్వ, సర్వశక్తిత్వాదికల్యాణగుణములు కలవాఁడును అని తేలుచున్నది. ఈయర్థము "సవితా సకలోత్పత్తిస్థితిసంహారకారణమ్" అను నిర్వచనముచే నేర్పడినది. దేవస్య=దివ్ క్రీడాకాంతిషు అను ధాతువువలన నేర్పడిన నిరతిశయానందము, నిరతిశయకాంతి

మత్త్వము గలవాఁడగు శ్రీమన్నారాయణునియొక్క, వరేణి యమ్ = ఆశ్రయణీయమగు (ఇందువలన వాత్సల్యస్వామిత్వ సౌశీల్యసౌలభ్యాదిగుణములు తోఁచుచున్నవి) "సవితుః దేవస్య వరేణ్యమ్" అను మూఁడుశబ్దములవలనను పుష్కలమగు నారాయణశబ్దార్థము తోఁచుచున్నది. "భర్గః" అనుటవలన నిరతిశయౌజ్జ్వల్యసౌందర్యాదిగుణవిశిష్ట విగ్రహము తోఁచు చున్నది. ఇచట విగ్రహశబ్దము ప్రకృతోపయుక్తమగు చరణరూపమైన అవయవవిశేషమును చెప్పుచున్నది. ఇంత వఱకు గాయత్రీమంత్రముయొక్క "తత్సవితుర్వరేణియం భర్గో దేవస్య" అను భాగముచే "శ్రీమన్నారాయణచరణౌ" అనుదానిశబ్దార్థము వివరింపఁబడినది.

ధీమహి = రక్షకుఁడని ధ్యానించెదము. ఇందువలన "శరణం ప్రపద్యే" అను శబ్దముల అర్థము వివరింపఁబడు చున్నది. గాయత్రీపూర్వ ఖండముచే ద్వయమంత్రపూర్వ ఖండార్థము వివరింపఁబడుచున్నది. "ధియో యో నః ప్రచోద యాత్" అను గాయత్రీమంత్రభాగమం దున్న "యః" అను పదము సకలప్రమాణప్రసిద్ధ లక్ష్మీవిశిష్టుఁడగు నారాయణుని ప్రతిపాదించు తచ్ఛబ్దమునకు ప్రతిసంబంధిగా నుండుటచే నీయర్థమును ప్రతిపాదించుచున్నది. నః=భగవంతుఁడే ఉపాయ మును, ఉపేయమును అని గ్రహించిన మాకు, ధియః = పరి పూర్ణానవరత నిత్యవిశదతమానన్య ప్రయోజనానవధికాతిశ యాతిప్రియ భగవదనుభవజనిత ప్రీతికారిత కైంకర్య విషయ జ్ఞానంగళై, ఇందలి ధీశబ్దము "తజ్జ్ఞాన మజ్ఞాన మతోఽన్య

దు_క్తమ్"అను శ్రీవిష్ణుపురాణవచనమం దున్న జ్ఞానశబ్దమునకు పర్యాయము. కైంకర్యజ్ఞానమే జ్ఞానము.తదితర జ్ఞాన మజ్ఞాన మనెడు అర్థమును ప్రతిపాదించుటచే కైంకర్యవిషయజ్ఞానమునే ప్రధానముగా ప్రతిపాదించుచున్నది. ప్రచోదయాత్ = ప్రేరణచేయును. స్వముఖోల్లాసహేతుభూత మగు పరిచర్యయందు నియమించు నని తాత్పర్యము. ఇచట ప్రార్థనార్థక మగు లకారము(క్రియాపదరూపము)చే కైంకర్య ప్రార్థన చెప్పఁబడుచున్నది. "యః" అను పదముచే "శ్రీమతే నారాయణ" అను శబ్దముల అర్థము. "నో ధియః ప్రచోదయాత్" అనుపదములచే కైంకర్యప్రార్థనావాచక మగు "ఆయ" అను దాని అర్థము, "కైంకర్యమందు భగవంతుని చేతనే నియమింపఁబడినవాఁడు." అనుతాత్పర్యముచే మమకారనివృత్తిని చెప్పు నమశ్శబ్దముయొక్క అర్థమును చెప్పఁబడుచున్నవి.

మూ॥ ఓ మాపో జ్యోతీ రసోఽమృతం బ్రహ్మ భూర్భువస్సువరోమ్॥

దీని అర్థము. ఆపః = జలభూతము, జ్యోతిః = తేజోభూతము, (పంచభూతముల కివి ఉపలక్షణము) రసః = రసతన్మాత్ర, (ఇది శబ్దస్పర్శరూప రసగంధము లను తన్మాత్రలకుపలక్షణము) అమృతమ్ = కాలము, బ్రహ్మ = మూలప్రకృతి, భూః = భూలోకము, భువః = భువర్లోకము, సువః=సువర్లోకము, (సర్వలోకములు) ఇవి యన్నియును, ఓమ్ = బ్రహ్మాత్మకము, ఈమంత్రములో సంతమందు ప్రణవ ముండుటచే

నీలోకాదు లన్నియు పరబ్రహ్మమందే పుట్టుచున్నవి లీనమగు చున్న వనునర్థ మేర్పడుచున్నది. గాయత్రీమంత్రమందున్న మొదటిప్రణవముచేత జీవునికి భగవచ్ఛేషత్వమును, గాయత్రీశిరస్సుచే నచేతనవర్గమునకు భగవదాత్మకత్వమును బ్రతిపాదింపఁబడినది. ఇట్లు చేతనాచేతనాత్మక ప్రపంచవిశిష్టుఁడగు పరమాత్మయొక్క ఉపాసనము గాయత్రీమంత్రముచేఁ బ్రతిపాదింపఁబడుచున్నది.

ఇఁక సూర్యోపస్థానము.

"త్రిః ప్రాణా నాయమ్య ప్రాతస్సంధ్యోపస్థానం కరిష్యే"

అని సంకల్పము చేసి,

"ఉత్తమ ఇత్యనువాకస్య వామదేవ ఋషిః,
అనుష్టుప్ ఛందః, గాయత్రీ దేవతా."

అని చెప్పి "గాయత్ర్యుద్వాసనే వినియోగః" అని చెప్పి,

మూ॥ ఉత్తమే శిఖరే దేవి భూమ్యాం పర్వతమూర్ధని। బ్రాహ్మణేభ్యోఽభ్యనుజ్ఞానం గచ్ఛ దేవి యథాసుఖమ్॥

అర్థము. హేదేవి = ఓగాయత్రీ, పర్వతే = మేర్వాదిపర్వతములయొక్క, మూర్ధని=ఊర్ధ్వభాగమందున్న, ఉత్తమే= శ్రేష్ఠమైన అనఁగా నేకాంతి ఋష్యాది భాగవతపరిగృహీతమయిన, శిఖరే = శిఖరమందు, యథాసుఖమ్=సుఖమగునట్లు, గచ్ఛ = వెళ్లుము, దేవి = నిరతిశయకాంతితోఁ గూడినదానా!

బ్రాహ్మణేభ్యః = నిరంతరోపాసకులగు బ్రాహ్మణులచే, అనుజ్ఞానమ్= అనుమతి, కృతమ్=చేయఁబడినది.

ప్రతిదినము సంధ్యోపాసనానంతరమందు తప్పక చేయవలసిన అభిగమనోపానాది కర్మములకు నియమింపవలయు నని తాత్పర్యము.

"సంధ్యాహీనోఽశుచి ర్నిత్య మనర్హ స్సర్వకర్మసు"

అన్నట్లు సంధ్యావందనానంతరమందే యితర కర్మముల నాచరింపవలయును.

సంగారోపస్థానమంత్రము.

"మిత్రస్యేతి ఋచాం విశ్వామిత్ర ఋషిః, ఆద్యస్య భీరుట్ఛందః, పరయో ర్గాయత్రీత్రిష్టుభౌ, ఛందసీ, మిత్రో దేవతా" అని న్యసించి "ప్రాతస్సంధ్యోపస్థానే విని యోగః."

అని చెప్పి.

మూ॥ "మిత్రస్య చర్షణీర్ధృతః శ్రవో దేవస్య సానసిమ్। సత్యం చిత్రశ్రవ స్తమమ్। మిత్రోజనాన్ యాతయతి ప్రజాన న్మిత్రో దాధార పృథివీ ముత ద్యామ్। మిత్రః కృష్టీరనిమిషాభిచష్టే సత్యాయ హవ్యం ఘృతవ। ద్విధేమ ప్రసమిత్రమర్తో అస్తు ప్రయస్వా న్యస్త ఆదిత్య శిక్షతి వ్రతేన। నహన్యతే న జీయతే త్వోతో నైన మగంహో అశ్నో త్యంతితో న దూరాత్॥"

అర్థము. చర్షణీః = జ్ఞానులను, ధృతః = పోషించువాఁడును, దేవస్య=క్రీడాయుక్తుఁడుననగు, మిత్రస్య=పరమాత్మ యొక్క, శ్రవః=కీర్తి, సా=బాగుగ, నసిమ్=సేవింపఁదగినది, ఆకీర్తి యెట్టి దనఁగా, సత్యమ్=కాలాంతరమందుఁగూడ నశింపనిది, చిత్రశ్రవస్తమమ్ = ఆశ్చర్యకరములైన భగవచ్చేష్టల ననుసరించిన దగుటచే వినువారికి మిక్కిలి సుఖకరమైనది, ఇట్టి కీర్తిని స్తుతించుచున్నా నని తాత్పర్యము.

మిత్రః = పరమాత్మ, జనాన్ = జనులను, ప్రజానన్=వారివారికర్మములకు తగిన ట్లనుగ్రహించువాఁడై, యాతయతి=వారివారి కర్మములయందు నియోగించుచున్నాఁడు, కర్మానుగుణముగా ప్రేరకుఁ డగుటచే వైషమ్యము, నిర్దయత్వము మొదలగు దోషము లతనికి ప్రసక్తములు కావని తాత్పర్యము. పృథివీమ్=భూమిని, ఉత=మీఁదనుండు, ద్యామ్=ఆకాశమును, మిత్రః=పరమాత్మ, దాధార=ధరించెను, మిత్రః=పరమాత్మ, కృష్టీః=ప్రజలను, అనిమిషా=రెప్పపాటు లేకుండ జాగరూకుఁడయి, అభిచష్టే=ప్రకాశింపఁ జేయుచున్నాఁడు. అనఁగా జ్ఞానప్రదానముచే రక్షించుచున్నాఁడు, సకలజనభజనీయము, అవిచ్ఛిన్నము, ఆశ్చర్యజనకమును అగు, మహాయశస్సు గలిగి యుండుట, నానావిధజంతుసమూహప్రేరకత్వము, పృథివ్యాదిసకల తత్త్వధారకత్వము, అసంకుచితజ్ఞానముచే సకలజంతువులను ప్రకాశింపఁజేయుట పరమపురుషచిహ్నములు.

సత్యాయ=నిర్వికారుఁడగు భగవంతునికొఱకు, హవ్యమ్=పురోడాశాదికమును, ఘృతవత్ = నేతితోఁగలిసియున్నదానినిగా, విధేమ=చేయఁగలము.

క్రిందఁ జెప్పిన "శ్రవ స్తమమ్." అనుదానివఱకును ఉన్నవాక్యములచే భగవంతుని విషయమయిన వాచికకైంకర్యము, "మిత్రో జనాన్" ఇత్యాదివాక్యములచే మానసికకైంకర్యము, "సత్యాయ హవ్యమ్" ఇత్యాదివాక్యములచే కాయికకైంకర్యమును చెప్పఁబడినవి.

హేమిత్ర=ఓయిభగవంతుఁడా!, ఆదిత్య=ప్రళయకాలమందు సర్వమును భక్షించువాఁడా!, యః మర్త్యః=ఏమనుష్యుఁడు, వ్రతేన=పూజావ్రతముతోఁ గూడినవాఁడై, తే=నీవిషయమయి, శిక్షతి=అన్నము మొదలగువానిచే నుపచారమొనరించుచున్నాఁడో, సః=ఆమనుష్యుఁడు, ప్ర=మిక్కిలి, ప్రయస్వాన్=అన్నాదిసంపత్తు గలవాఁడు, అస్తు=అగునుగాక భగవదారాధనము చేయకుండ తాను భుజింపఁగూడ దను నియమము గలవాఁడై యెవఁడు భగవదారాధనము చేయునో వానికి భగవంతుఁడు ప్రకృష్టమగు అన్నమును అనఁగా బ్రహ్మానుభవమును కటాక్షించుచున్నాఁడు.

త్వా = నీచేతను, ఉతః=రక్షింపఁబడిన వాఁడు, నహన్యతే=మృత్యువుచేఁ జంపఁబడఁడు.నజీయతే=శబ్దస్పర్శాదివిషయములచే జయింపఁబడఁడు. ఇందుచే భగవంతుఁడు తనభక్తుల నాధ్యాత్మికాదిదుఃఖములనుండి రక్షించు నని తాత్పర్యము.

ఏనమ్=ఈనీభక్తుని, అంహః=పాపము, అంతితః=ఈజన్మమందుఁగాని,దూరాత్=పూర్వజన్మమందుఁ గాని, నాశ్నోతి=ఆక్రమింపదు.ఇందుచే ముముక్షువునకు పూర్వజన్మమందలి పుణ్యాపాపములు నశించు ననియును, ఉత్తరజన్మమునందలి పుణ్యాపాపములు లేశమాత్రమును అంట వనియును ప్రతిపాదింపఁబడినది.

ఈమంత్రములచేతను అర్ఘోదితుఁడైన సూర్యుని, తన్మణ్డలాంతర్వర్తి యగు భగవంతునిని, స్తుతించి "సంధ్యాయై నమః,సావిత్ర్యై నమః,గాయత్ర్యై నమః,సరస్వత్యై నమః, సర్వాభ్యో దేవతాభ్యో నమోనమః" అని పంచదేవతలకును ప్రదక్షిణనమస్కారము లొనర్చి "కామోఽకార్షీ న్మన్యురకార్షీ న్నమోనమః" అని చెప్పి "అహం భో అభివాదయే" అని అభివాదనము చేయవలయును. "ప్రాచ్యై దిశే నమః, దక్షిణాయై దిశే నమః, ప్రతీచ్యై దిశే నమః, ఉదీచ్యై దిశే నమః." అని ప్రాచ్యాదిదిక్కులకు నమస్కరింపవలెను. "ఊర్ధ్వాయ నమః, అధరాయ నమః, అంతరిక్షాయ నమః, భూమ్యై నమః, విష్ణవే నమః."

"ధ్యేయ స్సదా సవితృమండలమధ్యవర్తీ,
నారాయణ స్సరసిజాసనసన్నివిష్టః,
కేయూరవాన్ మకరకుండలవా న్కిరీటీ .
హారీ హిరణ్మయవపుర్ధృత శంఖచక్రః.
శంఖచక్రగదాపాణే ద్వారకానిలయాచ్యుత,
గోవింద పుండరీకాక్ష రక్ష మాం శరణాగతమ్.

ఆకాశాత్పతితం తోయం యథా గచ్ఛతి సాగరమ్,
సర్వదేవనమస్కారః కేశవం ప్రతి గచ్ఛతి.
శ్రీ కేశవం ప్రతి గచ్ఛత్యోం నమ ఇతి.
నమో బ్రహ్మణ్యదేవాయ గోబ్రాహ్మణహితాయచ,
జగద్ధితాయ కృష్ణాయ గోవిందాయ నమోనమః.
శ్రీగోవిందాయ నమోనమ ఇతి."

ప్రణమ్యాభివాద్యచ ప్రాణానాయమ్య, అద్యానుష్ఠితే ప్రాతస్సంధ్యావందన కర్మణి మధ్యే సంభావితమంత్రతంత్ర స్వరవర్ణ విధివిపర్యాస దోష ప్రాయశ్చిత్తార్థం శ్రీకృష్ణాయ నమ ఇతి కృష్ణానుస్మరణం యథాశక్తి కరిష్యే ఇతి సంకల్ప్య కృష్ణానుస్మరణం కుర్యాత్.

మఱికొందఱు మూలమంత్రమగు అష్టాక్షరీ మంత్రమును సంధ్యావందనాంతమందు జపింపవలెనని చెప్పుచున్నారు.

## మాధ్యాహ్నిక సంధ్యావందనము.

"పాదౌ ప్రక్షాళ్య ఆచమ్య ప్రాణానాయమ్య శ్రీభగవదాజ్ఞయా శ్రీమన్నారాయణ ప్రీత్యర్థం మాధ్యాహ్నిక సంధ్యాముపాసిష్యే" అని సంకల్పము ప్రాతస్సంధ్యయందు వలెనే "ఆపో హి ష్ఠాది" మంత్రములచే మార్జన చేసికొనవలెను.

"ఆపః పునం" త్విత్యనువాకస్య ఆప ఋషిః, అనుష్టుప్ఛందః, బ్రహ్మణస్పతి ర్దేవతా," అని న్యసించి, "అపాం ప్రాశనే వినియోగః" అని చెప్పి.

హ_స్తమందు జలమును గ్రహించి,

మూ॥ ఆపః పునంతు పృథివీం, పృథివీ పూతా పునాతు మామ్, పునంతు బ్రహ్మణస్పతిః, బ్రహ్మ పూతా పునాతు మామ్, యదుచ్ఛిష్ట మభోజ్యం యద్వా దుశ్చరితం మమ, సర్వం పునంతు మామాపోఽస తాంచ ప్రతిగ్రహగ్ం స్వాహా॥

అను అనువాకముచే జలప్రాశనము చేయవలెను.

టీక. ఆపః = వర్షోదకములు, పృథివీమ్ = భూమిని, పునంతు = పరిశుద్ధముగాఁ జేయునుగాక. శుద్ధస్వరూపమగుటచే వర్షజలమునకు పృథివీపావన కరత్వము చెప్పఁబడినది. పూతా = ఇట్లు పరిశుద్ధమైన, పృథివీ = భూమి, మామ్ = నన్ను, పునాతు = పరిశుద్ధునిగాఁ జేయునుగాక. పరమాత్మకు జలము విశేషస్థాన మగుటవలనను, పృథివి అభిమతురాలగుటవలనను రెండింటికిని పావనకరత్వము చెప్పఁబడినది. బ్రహ్మణః = బ్రహ్మకు, పతిః = ప్రభువయిన, పరమాత్మ లేక, ప్రణవమునకు ముఖ్యప్రతిపాద్యుఁడైన పరమాత్మ, మా = నన్ను, పునంతు = పరిశుద్ధునిగాఁ జేయునుగాక, బ్రహ్మపూతా = పరమాత్మచే పరిశుద్ధమయిన భూమి, మామ్ = నన్ను, పునాతు = పవిత్రునిగాఁ జేయునుగాక, లేక; బ్రహ్మపూతాః = పరమాత్మచేఁ బరిశుద్ధమయిన జలములు, పునంతు = పవిత్రునిగాఁ జేయునుగాక, ఉచ్ఛిష్టమ్ = పరుఁడు తినఁగా మిగిలిన, యత్ = ఏ అన్నము నాచే భుజింపఁబడినదో, అభోజ్యమ్ = జాత్యాశ్రయనిమి_త్తదుష్టమగు నేయన్నమును నేను తింటినో, యద్వా = లేక, మమ = నాయొక్క, యద్దుశ్చరితమ్ = మనో

వాక్కాయములచేఁ జేయఁబడిన యేదుష్టచేష్ట కలదో, అస
తామ్=దుర్జనులయొక్క, ప్రతిగ్రహంచ = ద్రవ్యపరిగ్రహము
అనెడు, సర్వమ్ = దీనినంతయును, ఆపః=జలములు, పునంతు=
శుద్ధి చేయునుగాక. స్వాహా = దీని నంతయును భగవత్పా
దారవిందములయందు సమర్పించుచున్నాను.

"ధధిక్రావ్ణః" ఇత్యాది మంత్రములు
ప్రాతస్సంధ్యయందువలెనే చెప్పవలెను.

మాధ్యాహ్నిక సంధ్యయం దర్ఘ్యప్రదాన మొక
మాటే చేయవలెను. తరువాత గాయత్రీమంత్రజపము
మొదలగునవి యన్నియును ప్రాతస్సంధ్యకువలెనే.

మాధ్యాహ్నిక సూర్యోపస్థానమంత్రము.

"ఆసత్యేనేతి షడృచాం హిరణ్యస్తూప ఋషిః,
ఆద్యయో స్త్రిష్టుప్, చతసృణాం గాయత్రీ
జగత్యుష్ణిక్ త్రిష్టుభశ్ఛందాంసి, సవితా దేవతా"

అని న్యసించి, "మాధ్యాహ్నికసంధ్యోపస్థానే విని
యోగః" అని చెప్పి.

మం॥ ఆసత్యేన రజసా వర్తమానో నివేశయ న్నమృతం
మర్త్యంచ హిరణ్యయేన సవితా రథేనాదేవో
యాతి భువనా విపశ్యన్, ఉద్వయం తమసస్పరి పశ్యం
తో జ్యోతి రుత్తరమ్, దేవం దేవత్రా సూర్య
మగన్మ జ్యోతి రుత్తమమ్, ఉదుత్యం జాతవేదసం
దేవం వహంతి కేతవః, దృశే విశ్వాయ సూర్యమ్,
చిత్రం దేవానా ముదగా దనీకమ్, చక్షు ర్మిత్రస్య

వరుణస్యాగ్నేః, ఆప్రా ద్యావాపృథివీ అంతరిక్షగ్ం,
సూర్య ఆత్మా జగత స్తస్థుషశ్చ తచ్చక్షు ర్దేవహితం
పురస్తా చ్ఛుక్ర ముచ్చరత్, పశ్యేమ శరదశ్శతం,
జీవేమ శరదశ్శతం, నందామ శరదశ్శతం, మోదామ
శరదశ్శతం, భవామ శరదశ్శతం, శృణవామ శరద
శ్శతం, ప్రబ్రవామ శరదశ్శతం, అజీతాస్స్యామ
శరదశ్శతం, జ్యోక్చ సూర్యం దృశే య ఉదగా న్మ
హతో ఽర్ణవా ద్విభ్రాజమానస్సరిరస్య మధ్యాత్స
మావృషభో లోహితాక్ష స్సూర్యో విపశ్చి న్మనసా
పునాతు॥

టీక. సత్యేన = వికార రహితమయిన లోకమందుఁ
గాని, అనఁగా కాలకృతపరిణామరహితమైన వైకుంఠ లోక
మందుఁ గాని, రజసా = సత్త్వరజస్తమోగుణ ప్రకృతి
కార్యమయిన బ్రహ్మాండ సహస్రమందుఁ గాని, (ఈ రెండు
శబ్దములచే నిత్యవిభూతియు లీలావిభూతియు చెప్పఁబడినది)
ఆవర్తమానః = అంతర్బహిస్స్థితుఁడై, దేవః = క్రీడాశీలుఁ
డగు, సవితా = సకలజగత్స్రష్ట యగు పరమాత్మ, అమృ
తమ్ = బ్రహ్మానుభవమును, మర్త్యంచ = నశ్వరమగు
నైశ్వర్యకైవల్యపుత్త్రాది ఫలములను, నివేశయన్ = ఇచ్చెడు
వాఁడై, హిరణ్యయేన = మనోహరమైన, రథేన = గరుడ
రథముచే ("సుపర్ణోసి గరుత్మాన్" అను శ్రుతిచే గరుడునికి
విష్ణురథత్వము ప్రసిద్ధము) లేక, హిరణ్యయేన = శ్లాఘ్య
తమమైన, రథేన=ప్రణవరథముచే, ఆ = అంతటను, యాతి =
సంచరించుచున్నాఁడు.

"ఓంకారరథ మాస్థాయ స్థిత స్స పురుషోత్తమః"

అనుస్మృతిచే సర్వవాఙ్మయమూలమగు ప్రణవము నకు రథత్వనిరూపణము యుక్తమే. అతఁ డేమి చేయుటకు సంచరించుచున్నాఁ డనఁగా.—

భువనా=సకలప్రాణివర్గములను, విపశ్యన్=తమతమకర్మముల కనుగుణముగా నియమించుటకు వారిని విశేషముగా చూచువాఁడై సంచరించుచున్నాఁ డనుట. ఇట్టివాని నుపాసింపవలయు నని తాత్పర్యము.

తమసః = ప్రకృతికంటె, పరి=మీఁదనున్న, ఉత్తరమ్= ఉత్కృష్టమగు, జ్యోతిః = తేజః ప్రచురమైన పరబ్రహ్మమును, ఉత్పశ్యంతః = ఊర్ధ్వముఖముగా ధ్యానించు, వయమ్=మేము, దేవత్రా=దేవతలయందు అనఁగా సర్వవస్తువులయందును ఉన్న, ఉత్తమం దేవమ్=దేవతలలో నుత్కృష్టమగు, జ్యోతిః= తేజోరూపుఁడగు పరమాత్మను, అగన్మ= పొందితిమి. సంసారసాగరమునుండి ముక్తి నొందుటకు సమర్థుల మయితిమి. సమస్తకార్యకారణజాతము నతిక్రమించి యుండుటచే నస్పృష్టసంసారగంధుఁడై నిరతిశయతేజోయుక్తమగు శరీరము గలవాఁడై ప్రకాశించుపరమపురుషు నుపాసించుజీవుఁడు సర్వవ్యాపకుఁడును సర్వవ్యాపకమైన విగ్రహము గలవాఁడును అగుపరమాత్మను పొందునని తాత్పర్యము.

ఉదుత్యమ్=విడువని స్వస్వభావముగలవాఁడై అవతరించిన, జాతవేదసమ్ = సర్వభూతముల నెఱింగినవాఁడు, జాతవేదస్సను పేరుగలవాఁడును అగు, దేవం సూర్యమ్=పరమాత్మను,

కేతవః= ప్రభావప్రకాశకములయిన జ్ఞానశక్త్యాది దివ్యాత్మగుణములు, విశ్వాయ= అందఱకొఱకు, దృశే=దర్శనముకొఱకు, వహాంతి=అనతరింపఁజేయుచున్నవి. పరమపదమందు నిత్యముక్తులతోఁ నిరతిశయానందము ననుభవించు పరవాసుదేవుఁడు లీలావిభూతియందు తాపత్రయమహాజ్వాలలచే దంద్యహ్యమానులయి బ్రహ్మానందానుభవము లేనివారై అతిక్షుద్రవిషయభోగములయం దాసక్తులయి యున్న జీవులను జూచి కరుణించి వాత్సల్యకారుణ్యాది గుణపూర్ణుఁడై రామకృష్ణాది రూపములతోఁ భూమియం దవతరించుచున్నాఁడు. అట్టిభగవంతుని భజింపవలయు నని తాత్పర్యము.

దేవానామ్=దేవతలకు, చిత్రమ్= నానావిధమగు, అనీకమ్ =సైన్యము, సర్వేశ్వరుని యొద్దనుండి, ఉదగాత్ =బయలుదేరెను. మత్స్యకూర్మాది స్వమూర్తిభేదములచేఁగాని, భరతశత్రుఘ్నసాత్యకి బలభద్రాది పరికరములచేతఁగాని దేవతలకు సాహాయ్యము చేయుచున్న భగవంతుని భజింపుఁ డని పూర్వవాక్యముతోఁ అన్వయించవలెను. మిత్రస్య = సూర్యునికి, వరుణస్య=వరుణునికి, అగ్నేః=అగ్నికి, అనఁగా సకలదేవతలకును, చక్షుః = కన్నువలె జ్ఞానప్రదుఁడగు, సూర్యః = పరమాత్మ, ద్యావాపృథివీ = స్వర్గమును భూమిని, అంతరిక్షమ్ = ఆకాశమును అనఁగా సకలవస్తుజాతమును, ఆ=అంతటను, అప్రాః= నిండియున్నాఁడు. అందువలన, జగతః = జంగమమును, తస్థుషశ్చ = స్థావరాత్మకమును అగు సకలజగత్తునకును, ఆత్మా= ఆత్మ అగుచున్నాఁడు. నియమనపూర్వకముగా వానియందు వ్యాపించి యున్నాఁడు. ఇట్టి పరమాత్మ ఉపాస్యుఁ డనుట.

తత్ =శ్రుతిప్రసిద్ధుఁడును, చక్షుః=సర్వజనులకును జ్ఞాన ప్రదుఁడును, దేవహితమ్ = దేవతలకు హితము చేయువాఁడును, శుక్రమ్ = శుద్ధస్వరూపుఁడును, ఉచ్చరత్ = ఉద్యద్రూపుఁడును అగు పరమాత్మను, పురస్తాత్ = ఎదుటను, శరదశ్శతమ్ (నూఱుసంవత్సరములు) బహుకాలము, పశ్యేమ=చూతుముగాక. అట్టి సాక్షాత్కారము కొఱకు, శరదశ్శతమ్ = బహుకాలము, జీవేమ = జీవింతుముగాక. శరదశ్శతమ్ = బహుకాలము, నందామ = భగవద్గుణ విభూతులను జూచుచు ఆనందింతుము. శరదశ్శతమ్ = బహుకాలము, మోదామ=పూర్వోక్తానందముయొక్క చరిమావస్థను పొందుదుముగాక. శరదశ్శతమ్ = బహుకాలము, భవామ = ఉత్తరోత్తరాభి వృద్ధితో ఉందుముగాక. శరదశ్శతమ్ = బహుకాలము, శృణవామ = భగవత్కథలను విందుముగాక. శరదశ్శతమ్ = బహుకాలము, ప్రబ్రవామ = బాహ్యకుదృష్టిగల వారి విషయమయి కఠినోత్తరములఁ జెప్పుదుముగాక. శరదశ్శతమ్ = బహుకాలము, అజీతాస్స్యామ = వేదవిరుద్ధములగు శుష్కతార్కికోక్తులచే జయింపఁబడకుండ నుందునుగాక. జ్యోక్ = బహుకాలము, సూర్యమ్ = పరమాత్మను, దృశే = చూచుటకు అపేక్షించుచున్నారము. యః=ఏపరమాత్మ, మహతః = గొప్పదియగు, అర్ణవాత్ = సముద్రమునుండి, ఉదగాత్ = బయులువెడలెనో, సరిరస్య = సముద్రజలము యొక్క, మధ్యాత్ =మధ్యమందు, విభ్రాజమానః=విశేషముగా ప్రకాశించువాఁడో,సః వృషభః= సర్వశ్రేష్ఠుఁడును ధర్మప్రకాశకుఁడును, లోహితాక్షః=ఎఱ్ఱఁదామరలవంటి నేత్రములు కలవాఁడును, విపశ్చిత్ = సర్వజ్ఞుఁడు

ను అగు, సూర్యః=పరమాత్మ, మా=నన్ను, మనసా = సత్య సంకల్పముచే, పునాతు = పరిశుద్ధునిగాఁ జేయుఁగాక. ప్రతి బంధకములను నివర్తింపఁజేసి స్వానుభవము నిచ్చునుగాక."

ఇట్లు ఉపస్థానము చేసి శేష మంతయు ప్రాతస్సంధ్యా వందనమువలెఁ జేయవలయును.

## సాయంసంధ్యావందనము.

జలప్రాశనమంత్రము సూర్యోపస్థానమంత్రము తప్పఁ దక్కిన దంతయు ప్రాతస్సంధ్యయందువలెనే చేయవలెను.

"అగ్నిశ్చేత్యనువాకస్య సూర్య ఋషిః । దేవీ గాయత్రీ ఛందః। అగ్నిర్దేవతా" అని న్యసించి "అపాంప్రాశనే వినియోగః" అని చెప్పి జలమును గ్రహించి,

మం॥ అగ్నిశ్చ మా మన్యుశ్చ మన్యుపతయశ్చ మన్యుకృతేభ్యః పాపేభ్యో రక్షంతామ్, యదహ్నా పాప మకార్షమ్, మనసా వాచా హస్తాభ్యామ్, పద్భ్యాముదరేణ శిశ్నా, అహ స్తదవలుంపతు యత్కించ దురితం మయి, ఇద మహం మా మమృతయోనౌ సత్యే జ్యోతిషి జుహోమి స్వాహా॥

అని జలప్రాశనము చేయవలెను.

టీ. అగ్నిః=పరమాత్మ, అహ్న=దినమందు, అహః = అహింసకుఁడు, లేక, భక్తవర్గమును విడువని శ్రియఃపతి పూర్వోక్తములగు పాపములనుండి రక్షింపవలె నని పూర్వ మంత్రో నన్వయము. సత్యే = నిరుపాధికసత్తగల పరమాత్మ

యందు, తక్కిన పదముల కన్నిటికిని "సూర్యశ్చ" అను మంత్రమందువలెనే చూచుకొనవలయును.

సాయంసంధ్యోపస్థాన మంత్రము.

"ఇమం మ" ఇతి పంచర్చామ్ దేవరాత ఋషిః, గాయత్రీ త్రిష్టుప్ గాయత్రీ జగతీ - త్రిష్టుభ శ్ఛందాంసి- వరుణో దేవతా" అని న్యసించి "సాయంసంధ్యోపస్థానే విని యోగః." అని చెప్పి.

మూ॥ ఇమం మే వరుణ శ్రుధీ హవ మద్యాచ మృడయ, త్వా మవస్యు రాచకే। తత్త్వా యామి బ్రహ్మణా వందమాన స్తదాశాస్తే యజమానో హవిర్భిః। అహేడమానో వరుణేహ బోధ్యురుశగ్ం సమాన ఆయుః ప్రమోషీః। యచ్చిద్ధి తే విశో యథా ప్రదేవ వరుణ వ్రతమ్, మినీమసి ద్యవిద్యవి। యత్కించేదం వరుణ దైవ్యే జనేఽభిద్రోహం మనుష్యా శ్చరామసి, అచిత్తీయ త్తవ ధర్మా యుయోపిమ మా న స్తస్మా దేనసో దేవరీరిషః। కితవాసో యద్రిరిపుర్న దీవి। యద్వాఘా సత్య ముతయన్న విద్మ సర్వా తా విష్య శిథిరేవ దేవాఽథా తే స్యామ వరుణ ప్రియాసః॥

అని చెప్పి శేషమంతయు ప్రాతస్సంధ్యావందనము వలెనే చేయవలయును.

టీ. హేవరుణ! = "వృణోతి" అను వ్యుత్పత్తిచేఁ జేత నాచేతనాత్మకమగు ప్రపంచకమున కావరణభూతుఁడు,"వార

యతి" అను వ్యుత్పత్తిచే భక్తుల సాసనమూహాములను నివారించువాఁడు, అట్టి ఓపరమాత్మా ! మే = నాయొక్క ఇమమ్=ఈ, హవమ్ = ప్రార్థనారూపమైన పిలుపును, శ్రుధి = వినుము, అద్యాచ=ఇప్పుడు, మామ్=నన్ను, మృడయ = సుఖ పెట్టుము, అవస్యుః=రక్షణేచ్ఛగలనేను, త్వామ్=నిన్ను, ఆచకే: ప్రార్థించుచున్నాను. తత్ =అందుచే, త్వా=నిన్ను, బ్రహ్మణా: వేదమంత్రములచే, వందమానః=స్తుతించువాఁడనై, యామి శరణుపొందుచున్నాను లోకమందు శరణాగతుని మనో రథము నెఱవేర్చుట శరణ్యునికి విధిప్రాప్తమగు ధర్మ మ: కపోత వానరాది వృత్తాంతములయందు సుప్రసిద్ధము. అపా: కారుణ్య సౌశీల్య వాత్సల్యాది కళ్యాణగుణసముద్రుఁ డగుపర మాత్మవిషయమయి చెప్పవలయునా? తత్ =భగవదాశ్రయ: మమోఘమయిన ఫలము కలదు గావున, యజమానః యజ్ఞముచేయువాఁడు, హవిర్భిః=పురోడాశాదికహవిస్సులచే నిన్ను ఆరాధించి, ఆశాస్తే = ఇష్టసిద్ధిని ప్రార్థించుచున్నాఁడు. అనఁగా కర్మయోగనిష్ఠుఁడైన వానికే ఫలము సిద్ధమం యుండఁగా న్యస్తభరుఁడైన శరణాగతుని విషయమం వేఱుగఁ జెప్పవలెనా?

హేవరుణ!=ఓయిపరమాత్మా! అహేడమానః = కో గించనివాఁడవై, ఇహ = ఈలోకమందు నావిజ్ఞాపనమున బోధి = తెలిసికొనుము. అనాదికాలముమొదలుకొని వ్య నొందుచున్న నా అనంతాపరాధములను ఆలోచించి "నే: క్షమించను" అని కోపించఁగూడదు. నీవిషయమయి శరణా గతి నొనర్చు నా అపరాధములను క్షమించి నీకటాక్షమున

నన్ను పాత్రునిగాఁ జేసికొనవలయును. ఉరుశంస = గొప్పకీర్తి గలవాఁడా! నః=మాయొక్క, ఆయుః=ఆయుష్యమును, మా ప్రమోషీః=నశింపఁజేయకుము.

దేవ!=క్రీడాశీలుఁడవైన, వరుణ=ఓభగవంతుఁడా! తే = నిన్నుద్దేశించి చేయఁబడిన, యచ్చిద్ధి వ్రతం = యేవ్రతము కలదో, తత్=దానిని, ద్యవిద్యవి=ప్రతిదినము (సర్వకాలము) విశోయథా = ప్రాకృతమనుష్యులవలె, మినీమసి = మిక్కిలి నాశము చేయుచున్నాము. నీయారాధనము నిరోధించుటవలనఁ గలుగు అపరాధములను నీవే క్షమింపవలెను.

హేవరుణ!=ఓయిభగవంతుఁడా! దైవ్యేజనే = దేవతల విషయమయి, మనుష్యాః=నికృష్టులగు నయిన మేము, అచిత్తీ = అజ్ఞానముచే, యత్కించ=యేదో ఒక, అభిద్రోహమ్ = అపరాధమును, చరామసి = చేయుచున్నామో, యత్ = ఏపాపముచే, తవ=నీయొక్క, ధర్మా=కైంకర్యరూపమగు ధర్మములను, యుయోపిమ = నశింపఁజేయుచున్నామో, హే దేవ!= ఓయిభగవంతుఁడా!, నః=మాయొక్క, ఏనసః=ఆపాపముచేత, మారీరిషః = హింసింపవలదు, నాభరన్యాసము నంగీకరించిన నీచే నాసమస్తపాపములును క్షమింపఁబడఁదగినవి. కితవాసః= కపటముగల మేము, నరిరిపుః=శత్రువువలె, యత్=ఏ, దివి = నిషిద్ధకార్యమును చేయుచున్నామో, యద్వాఘా=ఏపాపము, సత్యమ్=బుద్ధిపూర్వకమో, ఉత=అట్లు కానియెడల, యత్ = ఏపాపమును, న విద్మ= తెలిసికొనలేకపోతిమో, సర్వా=సమస్తమైన, తా=ఆపాపములను, శిథిరేవ=భిన్నములగునట్లు, విష్య= పోఁగొటుము.

దేవ! = క్రీడాశీలుఁడ వగు, వరుణ! = పరమాత్ముఁడా! అథ = నీవు నాపాపములను క్షమించినతరువాత, తే = నీకు, ప్రియాసః = ఇష్టులము, స్యామ = అగుదుముగాక. నీవు మా సకల పాపములను విమోచనము చేసినతరువాతను బంధవినిర్ముక్తులమైన మేము నీ కత్యర్థము ప్రియులమై నీస్వరూపరూపగుణ విభూత్యాదుల ననుభవించువార మగుదుముగాక.

గద్య. ఇట్లు శ్రీమన్ముదుంబై వేంకటరామనృసింహాచార్యదేశి
కేంద్రచరణసరోరుహసేవక భారద్వాజగోత్రపవిత్ర
నేదేపల్లి వేంకటరమణాచార్యప్రణీతంబైన
"ఆంధ్రసంధ్యాటీక" సర్వమును
సంపూర్ణము.



(అమృతమహాసముద్రాదుద్ధృతోఽయమానన్దకౌస్తుభః.)

శ్లో. ఆనన్దీ కిల మన్యతే విభుతయా నేదేఽపి లోకే చిరా
దానన్దం ప్రవిశత్యసావయమివానన్దేన యో జీవతి,
ఆనన్దాయ కరోతి యత్నమధునానన్దాదిహాయాత్సదా
నన్దస్యానుభవత్యణోరణుకమానన్దేఽన్తతో లీయతే."

పురాణం సూర్యనారాయణతీర్థులు.

Printed at the Anan da Press, Madras—1921.